# మద్యపానమా? మానవత్వమా?

## (మద్యం సమస్య పై కొందరు మహిళల వ్యాసాలు)




**మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి**

**ఆంధ్రప్రదేశ్ - తెలంగాణా**

# మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి ప్రతిపాదనలు

1. కల్లు, సారా, బ్రాంది, విస్కీ, బీరు, రమ్ము, జిన్ను.. మొదలైన వాటన్నింటినీ కలిపి మత్తు పదార్థం అదేదైనా 'మద్యం' అనే పదాన్నే ఉపయోగించాలి.

2. అక్టోబర్ 2ని మద్యపాన వ్యతిరేక దినోత్సవంగా దేశవ్యాప్తంగా అధికారికంగా ప్రకటించేలా ప్రభుత్వంపై ఒత్తిడి తేవడంతోపాటు రాష్ట్రాలు, జిల్లాలన్నింటిలో ఆరోజు కార్యక్రమాలు జరిగేలా చూడాలి.

3. నెలలో తప్పనిసరిగా ఒకరోజు ప్రభుత్వ వైద్యుల్ని తీసుకుని పాఠశాల, కళాశాల, విశ్వవిద్యాలయాల్లో, గ్రామాలు, పట్టణాలు, నగరాల్లోని విద్యార్థులకు అవగాహనా తరగతులు ఏర్పాటు చేయాలి. అలాగే స్థానిక ఆసుపత్రుల్లో కౌన్సిలింగ్ సెంటర్లను ఏర్పాటు చేయడానికి ప్రయత్నించాలి.

4. డిసెంబరు 31, పెద్ద పండుగ, దసరా, మొదలగు పర్వదినాల్లో విచ్చలవిడిగా రెట్టింపై ప్రవహించే మద్యానికి అడ్డుకట్ట వేసేలా చైతన్యవంత కార్యక్రమాలు చేయడంతోపాటు ఈరోజుల్ని దృష్టిలో పెట్టుకుని మద్యం అమ్మకాల్ని పెంచుకునేలా టార్గెట్లను ఏర్పర్చుకునే ఎక్సైజు శాఖ తీరుని ఖండిస్తూ పత్రికా ప్రకటనలివ్వాలి.

5. మద్యం వల్ల జరిగే నేరాలు, ప్రమాదాలు, దుర్ఘటనల పట్ల ప్రజల్ని అప్రమత్తంగా ఉంచడంతోపాటు ఆ విధమైన ఘటనలు జరిగినప్పుడు బాధితుల్ని పరామర్శించడం, తోడ్పాటుకు ప్రయత్నించడం మనలోని మానవీయతకు ప్రతీకలని మర్చిపోకూడదు.

6. అన్ని మద్య వ్యతిరేక ప్రచార సమితి శాఖలు, ఎప్పటికప్పుడు ఈ సమస్యపై స్పందిస్తూ సృజనాత్మక రీతిలో కరపత్రాలు, పోస్టర్లు, బ్యానర్లు, వర్కుషాపులు, సభలు నిర్వహించగలిగేలా రూపొందాలి.

7. దేశంలోనూ, రాష్ట్రంలోనూ సంబంధిత సమస్యపై జరిగే ఆరోగ్యకర చర్చల పట్ల ఆసక్తి కనబర్చడంతోపాటు సోషల్ మీడియాలో మద్యవ్యతిరేక ప్రచారాన్ని ఆకర్షణీయంగా చేపట్టగలగాలి.

8. మద్యం ఇతర మాదకద్రవ్యాలు, వ్యసనాలకు సంబంధించిన ఉద్యమాలు ఎక్కడ జరిగినా వాటిని అధ్యయనం చేయడంతోపాటు నిజాయితీతో కూడిన మద్దతు ప్రకటించాలి.

9. మ.వ్య.ప్ర.స. అన్ని శాఖలూ నిబద్ధత గల కార్యకర్తల్ని పెంపొందించుకునేందుకు ప్రయత్నిస్తూ ఉద్యమానికి ముఖ్యమైన కళాత్మక బృందాల్ని, రచయితల్ని, గాయకుల్ని... రూపొందించుకుని పురోగమించాలి.

10. ప్రజల బలహీనతను ఆదాయంగా భావించే ప్రభుత్వాల అనాగరిక వైఖర్ని అప్రజాస్వామికమని నిరూపిస్తూ భావితరాల్ని ఈ మహమ్మారికి దూరం చేసేందుకు శాయశక్తులా కృషిచేయాలి.

# మద్యపానమా? మానవత్వమా?

(మద్యం సమస్యపై కొందరు మహిళల వ్యాసాలు)

సంకలనం

**గౌరవ్**


**మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి**

ఆంధ్రప్రదేశ్ - తెలంగాణా

# మద్యపానమా? మానవత్వమా??

(మద్యం సమస్యపై కొందరు మహిళల వ్యాసాలు)


సంకలన కర్త : గౌరవ్

ప్రచురణ : మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి
ఆంధ్రప్రదేశ్ - తెలంగాణా

ప్రతిపాదిత చందా : 20/-

ప్రతులకు : 9032094492

అట్ట ముఖచిత్రం : అంతర్జాలంలోని విభిన్న మద్య వ్యతిరేక ఉద్యమ చిత్రాలు

అట్ట వెనుక : జూన్ 1976 ఎమర్జెన్సీ సమయంలో హైద్రాబాద్ నుంచి చుండి జగన్నాథం గారి సంపాదకత్వంలో వెలువడిన 'చక్రం' మాసపత్రికలో ప్రముఖ ప్రజా కార్యకర్త గరిమెళ్ళ నారాయణగారు రాసిన వ్యాసం (కొద్దిపాటి మార్పులతో). అనేక ప్రజా ఉద్యమాల్లో పాలు పంచుకున్న ఆయన సర్వోదయ, జనతాదళ్, లోక్‌సత్తా, తెలుగుదేశం పార్టీల్లో క్రియాశీలక పాత్ర పోషించడమే కాక ఎన్.ఎ.పి.ఎమ్., పియుసిఎల్ లాంటి ప్రజా ఉద్యమ సంస్థల సంస్థాపకుల్లో ఒకరు. ప్రస్తుతం ముంబాయిలో ఉంటున్న వారు 'మానవ వాహిని' పేరుతో నిర్మాణాత్మక కృషి చేస్తున్నారు.

వివరాలకు : gouravmeka@gmail.com

డి.టి.పి. & కంపోజింగ్ : వి.యస్. గ్రాఫిక్స్, రాజమండ్రి

# ప్రస్తావన

మద్యం సమస్య ఎప్పుడు తెరమీదకొచ్చినా మహిళల్నే బాధితులుగా చూపించే పద్ధతి మీడియా కారణంగా అమలౌతోందనేది ఎంత నిజమో, సమాజంలోని కష్టజీవుల కుటుంబాల్లో లోతుగా చిచ్చుపెట్టి మహిళల్నికూడా ప్రధాన బాధితులుగా చేయడంలో మద్యం పోషించే వినాశకర పాత్ర కూడా అంతే నిజం[1]. మద్యాన్ని నైతిక పతనంగా మాత్రమే అంగీకరించే ధోరణి వలన నాగరికత పేరుతో ఆత్మిక పతనాన్ని అనుభవిస్తున్న యువతరం ఆ రుగ్మతనే ఆధునికతగా భావించడం జరుగుతోంది. అత్యాచారాలూ, దాడులు జరిగినప్పుడో – అమానుషంగా ప్రాణాలు పోయినప్పుడో మాత్రమే మనుషులమనే సంగతి గుర్తొచ్చి మద్యానికి వ్యతిరేకంగా స్పందించే కనీస బాధ్యతను కూడా తప్పదన్నట్లు నెత్తినేసుకునే మనకి ఈరోజు మద్యం నిర్వహిస్తున్న సర్వాంతర్యామి పాత్ర అంత సులువుగా అర్థం కాదు. అంతమాత్రంలో మద్యానికి వ్యతిరేకంగా ఆందోళన లేదని కాదు. ఉండాల్సినంత లేదనీ,నిర్మించాల్సినంత నిర్మించలేదనీ మాత్రమే[2]. ఈ క్రమంలో 'రాష్ట్ర వ్యాప్తంగా వివిధ స్రవంతుల్లో పనిచేస్తున్న క్షేత్రస్థాయి ఉద్యమకారులు మొదలుకుని, ప్రజల ఆలోచానా విధానాన్ని ప్రభావితం చేయటమే లక్ష్యంగా పనిచేస్తున్న భావోద్యమ శ్రేణులదాకా కొద్దిమంది మహిళల అభిప్రాయాలతో వ్యాసాలు రాయించి ప్రచురించాలనే ఆలోచనే ఈ సంకలనానికి సంకల్పస్ఫూర్తి. అక్టోబర్ 2న ఉభయ తెలుగు రాష్ట్రాల్లోని వివిధ ప్రాంతాల్లో ఒకేసారి విడుదల చేయాలని ఉత్కంఠతో హడావుడిగా 10 మందితో ఈ కృతిని తీసుకురావడం జరుగుతోంది. ఇందులోని తప్పులకు బాధ్యత నాదే. ఈ కార్యక్రమంలో కలిసొచ్చిన మిత్రులందరికీ పేరుపేరునా కృతజ్ఞతాభివందనాలు తెలుపుకుంటూ భవిష్యత్తులో ఈ కృషిని మరిపించే మరిన్ని మంచి ప్రయత్నాలు జరగాలని మనస్ఫూర్తిగా ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

భవదీయ

**గౌరవ్**

---

**కొన్ని వివరణలు :**

1. ఈ విషయంపై లోతైన చర్చ అవసరం. ఎందుకంటే, మద్యపాన వ్యతిరేకోద్యమాన్ని కాంగ్రెస్ స్వాతంత్ర్యోద్యమ కాలంలో మొదలుపెట్టడానికికూడా పెరియార్ భార్య నాగమ్మాళ్, సోదరి కనకమ్మాళ్ కారకులనీ, గాంధీజీ వారింటికి వెళ్ళినపుడు భర్తల తాగుడు కారణంగా తలెత్తే సమస్యల్ని వారాయనకి కళ్ళకు కట్టేలా వివరించి, మద్యాన్ని నిషేధించాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పారనీ, అందుకే ఒకసారి ఉద్యమం మొదలయ్యాక దాన్ని ఆపాలని కొందరు కాంగ్రెస్ పెద్దలు గాంధీజీకి చెప్పినపుడు ఆయన, "అందుకు సంబంధించిన ఏ నిర్ణయమైనా తీసుకోవలసింది నేను కాదు, ఆ ఇద్దరు ఆడవాళ్ళు" అని ఆ స్త్రీలపై గౌరవాన్ని చూపారనీ తెలుస్తోంది. ఉద్యమ ప్రభావంతో పెరియార్ తమ కుటుంబానికి చెందిన దాదాపు 500 కల్లుగీత కొబ్బరిచెట్లను కొట్టించివేశాడు. (వివరాలకు చూడు. బిసిల కుర్చీలపై అగ్రకులాల కబ్జా ఎన్నాళ్ళు? రచన – రమణమూర్తి, జనహర్ష ప్రచురణలు, 2008 పేజి – 117)
2. ఈ సమస్యని అధ్యయనం చేస్తూ వ్యసన వ్యతిరేక ప్రచార సమితి పరిధిలో మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి ప్రచురణలు కొంత ఉపకరిస్తాయి. (వివరాలకి చూడు. వ్యవస్థలు – వ్యసనాలు, రచన – గౌరవ్, ఆగష్టు 2015)

# నేపథ్యం

అక్టోబర్ 2, 2012న ఏర్పడిన **'మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి'** ఉభయ తెలుగు రాష్ట్రాల్లో ఎన్నో మిత్ర సంఘాలతో కల్సి, వివిధ కార్యక్రమాలు చేపడుతోంది. ప్రతీ సంవత్సరం డిసెంబర్ 31న 'నూతన సంవత్సరాన్ని మద్యంతో ఆహ్వానించవద్ద'నే నినాదంతో యువతపై దృష్టిని కేంద్రీకరిస్తూ వినూత్న తరహాలో కార్యక్రమాలు రూపొందించడం జరుగుతోంది. అలాగే పండగలప్పుడూ, వేడుకలప్పుడూ మంచికీ, చెడుకీ మద్యం పుచ్చుకునే వైఖర్నీ వ్యతిరేకిస్తూ ప్రచారం చేస్తోంది. **'కొత్తసంవత్సరాన్ని మద్యంతో ఆహ్వానించడం నాగరిక లక్షణమా'** అనే అంశంతో గత సంవత్సరం డిసెంబర్ 27న తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రి దగ్గర వేమగిరిలో రాష్ట్రస్థాయి మద్య వ్యతిరేక సదస్సును నిర్వహించడం జరిగింది. అంతకు ముందు నుంచే తెలుగు రాష్ట్రాల్లోని వివిధ ప్రాంతాల్లో క్షేత్రస్థాయి పర్యటనలు చేయడమూ, గ్రామీణ భారతావనిపై మద్యం యొక్క వినాశనాత్మక విష ప్రభావాన్ని కూలంకుషంగా అధ్యయనం చేయడమూ జరిగింది. ఈ క్రమంలో స్వచ్ఛంద మద్య బహిష్కరణ పాటిస్తున్న గ్రామాల్ని గుర్తించి ప్రోత్సహించడంతో బాటూ మిగతా గ్రామాలు కూడా ఆ స్ఫూర్తిని అనుసరించేలా చేయటం కోసం ప్రయత్నించడం జరుగుతోంది. అంతేకాక సంబంధిత సమస్యపై స్పందించే యువతకు సమస్యల్ని ఎదుర్కోవడంలోనూ, స్వార్థపర శక్తులు సృష్టించే అవరోధాల్ని అధిగమించడంలోనూ ఆసరాగా ఉండటం జరుగుతోంది. అంతేకాక అఖిలభారత స్థాయిలో వామపక్ష ప్రగతిశీల సంస్థలతోపాటూ సోషలిస్టు ఐక్య సంఘటనతోనూ, వివిధ దేశభక్తియుత గాంధేయ సంస్థలతోనూ సత్సంబంధాల్ని నెరపడం జరుగుతోంది. ఎన్.ఎ.పి.ఎమ్., నర్మదా బచావో ఆందోళన్, ఖుదాయి కిద్మత్‌గార్, ఆమ్ ఆద్మీ, లోక్‌సత్తా మొదలగు జాతీయ సంస్థలు మొదలుకుని జనచైతన్య వేదిక, సమాచార హక్కు ప్రచార ఐక్యవేదిక, మానవ హక్కుల వేదిక, జన విజ్ఞాన వేదికలు ఇంకా ఉభయ తెలుగు రాష్ట్రాల్లోని వివిధ ఉద్యమ శ్రేణులతో పురోగమించడం జరుగుతోంది. ఈ క్రమంలోనే తమిళనాడు, ఒడిస్సా, బెంగాల్, మహారాష్ట్ర, చత్తీస్‌ఘడ్, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, పంజాబ్, హర్యానా, ఢిల్లీ, హిమాచల్ ప్రదేశ్, ఉత్తరాఖండ్, జమ్మూకాశ్మీర్, కర్నాటక మొదలగు రాష్ట్రాల్లో పాక్షికంగా పర్యటించడంతో పాటూ ఈ మధ్య మద్యాన్ని నిషేధించిన బీహార్ ముఖ్యమంత్రి నితీష్‌కుమార్‌గారిని కలసి ప్రజా ఉద్యమకారులు జి.జి. పారిఖ్, మేధాపాట్కర్, సందీప్‌పాండే... వంటి వారి ఆలోచనల్ని కూడా పంచుకోవడం జరిగింది. ఇదంతా నాణానికి ఒకవైపు మాత్రమే. వివిధ ప్రాంతాల్లో జరుగుతున్న మద్యపాన వ్యతిరేకోద్యమాలన్నింటికీ 'మద్యపాన వ్యతిరేక ప్రచారసమితి' నిర్ద్వంద్వంగా తన మద్దతు ప్రకటిస్తూనే ఉన్నప్పటికీ, త్వరితగతిని స్పందించడంలో, కార్యకర్తల్ని తయారు చేసుకోవడంలో, ప్రధాన స్రవంతిలో మద్యంపై సంవాదం రాజేయగలిగిన వాతావరణాన్ని నిర్మించడంలో, పాలకులపై ఇందుకు సంబంధించిన ఒత్తిడి తేవడంలో ఇప్పటికీ చేయాల్సింది చాలా ఉందనే విషయం నిజాయితీగా గుర్తించాలి. అలాగే మహిళల్ని, యువతని కూడా చేర్చుకోలేకపోవడానికి గల కారణాల్ని స్వీయవిమర్శ చేసుకోవాలి. ఏ విషయాన్ని జనానికి అందించి వార్ని చైతన్యపరచాలన్నా వారిపై కుమ్మరించబడుతున్న మత్తుల్లోంచి ముందు వారిని బయట పడేయటమనేదొక ప్రాథమిక బాధ్యతగా ప్రతీ ఉద్యమ శ్రేణీ గుర్తించాలనే నిజాన్ని పేర్కొంటూ జిల్లాలవారీ కమిటీల్ని, గ్రామస్థాయి సమాఖ్యల్ని త్వరలోనే ఏర్పర్చుకునేలా సంస్థను నిబద్ధతగా బలోపేతం చేయాల్సిన కర్తవ్యం మనందరి మీదా ఉందని తెలియ జేసుకుంటున్నాను.

# సూచిక



**అనుబంధం**



## అంకితం

సామాన్య కుటుంబంలో పుట్టి
సాధారణ గృహిణిగా మద్యంపై
తిరుగుబాటు చేసి, అక్రమార్కుల
గుండెల్లో గుబులు పుట్టించి,
రాష్ట్రంలోనే రాజకీయ కల్లోలాన్ని
సృష్టించి, చిత్తశుద్ధి లేని ప్రభుత్వాల
పునాదుల్ని కూకటివేళ్ళతో పెకలించి,
కనీవినీ ఎరుగని మద్యపాన వ్యతిరేక
మహోద్యమాన్ని చరిత్రకందించి
భావితరాలకి స్ఫూర్తిగా నిలిచిన
**దూబగుంట రోశమ్మగారికి**
ప్రేమపూర్వకంగా...



# 1. మద్యపానం - ఒక పరిశీలన

- లక్ష్మీనాగేశ్వర్, ఉపాధ్యక్షురాలు, కుల నిర్మూలన సంఘం,
.హైద్రాబాద్, సెల్ : 9247815051

మద్యం! అంటే మత్తును కలిగించే ఒక పదార్థం అని అర్థం! మానవుడు సాధారణ జీవితంలో ఒక సంతోషాన్ని పొందడానికి, శారీరక శ్రమలో బాగా అలసిపోయినపుడు సేదతీరడానికి, మనస్సు బాగా దుఃఖపడుతున్నప్పుడు ఆ దుఃఖాన్ని మరిచిపోవడానికి ఇది బాగా ఉపయోగపడుతుంది.

పై కారణాల వల్ల మానవ నాగరికతోపాటు, మద్యం - దాని తయారి, అందులో రకరకాలు, నైపుణ్యాలు, రుచులు - వీటన్నిటిలో అభివృద్ధి సాధించడం జరిగింది. అందువల్లనే మద్యపానం అన్ని నాగరికతల్లోనూ, అన్ని సంఘాల్లోనూ కొండజాతులలోనూ అమలులో ఉంది.

**మద్యపానం వల్ల నష్టాలు :**

కాఫీలాగా త్రాగి సంతోషించ గలిగితే మద్యపానం వల్ల నష్టం ఏమిటి?

**ఒకటి :** ఇది చాలా గాఢమైన వాసన కలిగి ఉంటుంది. దీనిని ఇద్దరు ముగ్గురు కూర్చుని త్రాగుతున్నపుడు దాని వాసన ఆ వ్యక్తుల్లో ఊపిరితో కలిసి బయటకు వచ్చినపుడు, ఘోరమైన కంపు కొడుతుంది. ముక్కు పట్టుకొని దూరంగా వెళ్ళవలసి వస్తుంది. అంతే కాదు ఏ వ్యక్తి అయినా, అతిగా తాగి మన మధ్యకు వస్తే అతని శరీరం నుండి దుర్గంధం వెలువడుతుంది. అట్టి వారి విలువ, గౌరవాన్ని తగ్గిస్తుంది.

**రెండు :** త్రాగినవాళ్ళు తమ మాటల మీద, చేష్టలమీద నియంత్రణ కోల్పోయి తప్పుడు మాటలు మాట్లాడతారు, తప్పుడు చేష్టలు చేస్తారు. అందువల్ల త్రాగుబోతు గుంపులో - వారిలో వారికే, లేకుంటే ఎదుటి వారితో - వారి వారి స్థాయిని బట్టి, వాగ్వివాదాలు, దెబ్బలాటలు జరుగుతాయి. అట్టివి ఒక్కొక్కసారి హత్యలకు దారి తీస్తాయి.

**మూడు :** మామూలుగా చెయలేని నేరాలు మనిషి త్రాగినపుడు చేస్తాడు. మద్యపానం మితిమీరిన కొద్దీ మనిషి జంతువులాగ మారతాడు.

**నాలుగు :** ఒక మనిషి తోచక గాని, జబ్బు ఎక్కువైగాని, చెడు సహవాసాల వల్ల కాని, వృత్తిలో టెన్షను మర్చిపోవడానికి గాని, మద్యపానానికి బానిస అయితే - అతను ఉన్న స్థానం నుండి అధఃపాతాళానికి పతనమవుతాడు. అసత్య మాడుతాడు. మాట మీద నిలబడడు. దెబ్బలాడతాడు, పొగరుబోతు అయి, రౌడీయిజం చేస్తాడు. దీనికి అతడు ఇతర వ్యసనాలకు లోనవుతాడు. సిగరెట్లు కాలుస్తాడు, బాధ్యత ఉండదు, భార్యాబిడ్డలను కొడతాడు. తల్లిదండ్రుల మాట పట్టించుకోడు. సరిగా పని చెయ్యడు. డబ్బు తగలేస్తాడు. ఈ విధంగా ఒకటి ఏమిటి? - ఎన్నోవిధాల పతనమై - చివరకు సంసారాన్ని, జీవితాన్ని చేజేతులా నాశనం చేసుకుంటాడు.

అందువల్ల, వ్యక్తిగతంగా మద్యపానం సిరిగలవానికి చెల్లునేమో గాని, పేదవానికి పరమశత్రువు. డబ్బున్నవాడు సుఖం కోసమో, టెన్షను మరిచిపోవడం కోసమో, ఫ్యాషన్ కోసమో త్రాగుతాడు. తందనాలు ఆడతాడు. వారికి - ఆ డబ్బు ఖర్చుపై, దానిమీద ప్రభుత్వానికి వచ్చే ఆదాయానికి -సరిగా సరిపోతుంది. కానీ పబ్లిగ్గా మద్యం షాపులు నడిరోడ్డుమీద పెట్టి ప్రతివాడికి, డబ్బున్నవాడికి త్రాగడానికి వీలుగా మద్యం అందుబాటులో ఉంచితే - సమాజంలో 70 శాతం కష్టజీవులు, పేదలు త్రాగుబోతులవుతారు.

మామూలువారికి తాగుడు అందుబాటులో ఉంచడం ద్వారా, ఒక త్రాగుబోతు, నిష్ప్రయోజన, నిరర్థక సమాజాన్ని మనం తయారు చేస్తున్నాం.

ఒక పాఠశాల ఉంటుంది. అందులో చదువు చెబుతారు. అందులో మంచి అలవాట్లు, బుద్ధి జ్ఞానం నేర్పుతారు. మంచి పౌరుడి లక్షణాలు - బాధ్యతగా ఉండడం, చెడు అలవాట్లకు లోను కాకుండా ఉండడం, వినయం, విధేయత అన్నీ నేర్పుతారు. బయటకు రాగానే ఆ ప్రక్క వీధిలో మద్యం దుకాణం ఉంటుంది. అందులో వాళ్ళ నాన్న మందుకొని త్రాగుతాడు. ఇది ఏం నేర్పుతుంది? మందుకొని త్రాగు - అని నేర్పుతుంది. పిల్లలు దేనివైపు మ్రొగ్గుచూపుతారు? సులభమైన దాని వైపు! సుఖమైన దానివైపు! 'ఫలితం' త్రాగుడు!

త్రాగుడుకు అలవాటు పడ్డ వ్యక్తి ఎలా పతనం అవుతాడో ఒక ఉదాహరణలో చెబుతాను.

ఒకామె - వయస్సులో ఉండగా, పిల్లల్ని మంచి కాపురాన్ని, ఒదులుకొని పరాయి మొగవాడితో లేచి వచ్చింది. గత జీవితాన్ని మరిచి మసలవలసి వచ్చింది. పనిమనిషిగా ఇళ్లల్లో ఉండి వంట చేసుకుంటూ, వారి పిల్లల్ని సాకుతూ బ్రతుకుతోంది. ఒక ఇల్లుకాదు, ఒక ఊరు కాదు. సంవత్సరాలు గడిచిపోయాయి. తిరిగి సొంత ఊరు గాని, భర్తతో కాని కలవలేకపోయింది. ఒంటరితనం వెంటాడి తాగుడుకు బానిస అయింది. దానికోసం ఇంటివారి సామాను అమ్మి మద్యం తెప్పించుకుంటోంది. ఒకరి తర్వాతగా ఒకరు ఆమెను పనిలోంచి వెళ్ళగొట్టారు. ఇంకా బాధ పడింది. ఇంకా తాగింది. చివరకు అనారోగ్యంతో చనిపోయింది.

సుఖంకోసం గాని, ఒంటరితనంతోగాని, తాగుడుకు అలవాటు పడిన చాలా జీవితాలు ఇలానే ముగుస్తాయి. అలాంటివారి కుటుంబ సభ్యులు, పెళ్లి అయి ఉంటే భార్యాబిడ్డలు అందరూ కష్టపడతారు.

అందుకే మద్యం స్త్రీకి ప్రథమ శత్రువు! ఇలాంటి మద్యాన్ని సామాన్యులకు అందుబాటులో ఉంచరాదు. మద్యం వల్ల చితికిపోయిన కుటుంబాలు ఎన్నో!

డబ్బున్నవాడు తాగితే తాగనీ! చెడిపోతే చెడిపోనీ! అనుకుందామా? – అదీ సరిగా లేదు.

సంపాదన కలవాడు కులాసాకోసం తాగుతూ కొడుకును దగ్గర కూర్చోబెట్టుకుంటాడు. వాడికి ఇది మంచి విషయంలాగా తలకెక్కుతుంది. యవ్వనం రాకముందే - డ్రైవింగు లైసెన్సు లేకుండానే స్పోర్ట్స్ బైక్‌లు నడుపుతాడు. ఆక్సిడెంట్ చేసి కొంతమందిని చంపుతాడు. పబ్బుల్లో త్రాగి హైస్పీడులో కారు నడిపి కొంతమందిని చంపుతాడు. ఇవన్నీ సంఘానికి ఎంత హానికరం?

నేనీమధ్య చూస్తున్నాను. పిల్లలు బాగా చదువుకుంటున్నారు. ఉద్యోగమో - వ్యాపారమో తెలివిగా బాగా చేసుకుంటున్నారు. ఇక అంతే – సాయంకాలం అయ్యేసరికి ఒక చేతిలో మద్యంగ్లాసు, మరొక చేతిలో సిగరెట్టు! ఇదే స్టైల్, దానికతడు లక్షలు ఆర్జిస్తున్నాడనుకొని సిగరెట్టు తాగి, మద్యం సేవిస్తే బుర్ర బాగా చురుకుగా పనిచేసి, లక్షలు మేసేసే ప్లానులు కోట్ల ఫలితాలు నిస్తాయని భావిస్తారు. వాళ్ళని చూసి జేబులో డబ్బుల్లేని యువత కూడా అదే మార్గం అవలంభిస్తారు.

ఇంకా చిత్రం! వాళ్ళ చుట్టూ ఆడపిల్లలు గుమిగూడుతారు. అపుడపుడు వారు కూడా సేవిస్తారు! లక్షల్లో సంపాదిస్తున్నాం! – మేం చెడిపోయింది ఎక్కడ? అని ప్రశ్నిస్తారు. దీనికి జవాబు ఏమిటి? గృహిణులుగా – సత్ప్రవర్తకులైన పౌరుల్ని దేశానికి అందించవలసిన యువత మరణాలకు, చేతిలో మద్యం గ్లాసు, పురుషులను చిత్తుచేసి మరింత మత్తులో పడేసే వస్త్రాలంకరణ – తగునా? మీరే ఆలోచించి చెప్పండి! కాబట్టి మితిమీరిన మద్యపానం తగదు. కానీ తాగుతారు ఇది తగునా? పరిశీలిద్దాం.

ఒకరోజు రాత్రి 8 గంటలకు కోటి నుండి జూబ్లి హిల్స్‌కి ఆటోలో రావలసి వచ్చింది. కొంతదూరం వచ్చిన తర్వాత, ఆటో అతను మంచివాడుగా అనిపించి మాటలు మొదలు పెట్టాను. అతను తిరిగి మలక్‌పేట తన నివాసానికి వెళ్ళాలి. మామధ్య మాటలు నడుస్తున్నాయి.

"ఏమయ్యా! నీవు కూడా తాగుతావా?" అన్నాను.

"మరేం! రోజంతా కష్టపడతాము. ఏ రాత్రికో ఇంటి చేరతాము. కడుపునిండా తిని కొంచెం తాగి పడుకుంటే – తెల్లవారి మరలా పనికి సిద్ధంగా ఉంటాము. మరేం చెయ్యమంటారు చెప్పండి!"

"ఇంట్లో ఎలా తాగుతావు? పిల్లలు చెడిపోతారు కదా!"

"అవునమ్మా! అందుకనే - ఇంటికి వెళ్ళేముందే ఏదో కొట్టులో - కొంచెం తీసుకుంటాను. మా ఇంటిదానికి తప్ప పిల్లలకు తెలియదు. అది లేకుంటే మర్నాడు పనిలోకి కష్టం అమ్మా?" దీనికి జవాబు ఏమిటి?

కాబట్టి కష్టజీవుల కష్టం తీర్చడానికి, డబ్బున్న వారికి టెన్షన్లు తీరడానికి మద్యం ఉపయోగపడుతుందనేగా?

ఇంతకీ ఇది పరిమితి మించకూడదు. పిల్లల ముందు, పెద్దల ముందు త్రాగకూడదు. ఆడవాళ్లు అస్సలు త్రాగకూడదు. ఎందుకంటే వాళ్ళు తల్లులు కనుక, తల్లులు తాగితే - సమాజం మొత్తం త్రాగి చెడిపోతుంది కనుక.

ఇంకా ఇది అలవాటుగా కాకూడదు. వ్యసనంగా అస్సలు మారకూడదు. ఎందుకంటే వ్యసనాలు అన్నీ మనిషి పతనానికే దారితీస్తాయి.

ఐతే మద్యపానం పరిమితి మేరకు అనుమతించవచ్చని అనుకుందామా? మరి సంపూర్ణ మద్యపానం నిషేధం అమలులో ఉన్న రాష్ట్రాల సంగతి ఏమిటి? అక్కడ ప్రజలు కష్టపడి పనిపాటలు చేసుకుంటున్నారు కదా! అక్కడి ప్రభుత్వాలు మద్యపు ఆదాయం లేకుండానే అభివృద్ధి కార్యక్రమాలు చేయగలుగుతున్నాయి కదా!

అంటే సంపూర్ణ మద్య నిషేధం సాధ్యమే! పరిమితి మద్యపానం, పరిపూర్ణ మద్యపానానికే దారి తీస్తుంది. అందుకే మహాత్ముడు, జాతి జాగృతం కావాలంటే - **"వెయ్యండిరా వేటు! మద్యం మీద"** అన్నారు. ఆయన ఆజ్ఞను శిరసావహించి అమలు చెయ్యడం ప్రస్తుత ప్రభుత్వాల కర్తవ్యం.



**"అన్యాయాన్ని నేరంగా కాక ఆదాయంగా చూడటం అలవాటైన సమాజం అక్రమార్జనని ఆర్థిక సుస్థిరతగా భ్రమిస్తుంది. అందుకే మద్యాన్ని అనర్థంగా కాక ఆదాయంగా భావిస్తుంది. ప్రజల బలహీనతని ఆసరాగా తీసుకుని బడుగుల బతుకుల్ని బుగ్గిపాలు చేసే వ్యసనాల్ని ఆర్థిక సౌలభ్యం పేరుతో చట్టబద్ధంగా సమర్థించుకోవడాన్ని మించిన సిగ్గుమాలినతనం ప్రజాస్వామ్యానికి మరోటి లేదు."**

# 2. పీడిత ప్రజల జీవితాలను విధ్వంసం చేస్తున్న పాలకుల మద్యం పాలసీలను త్రిప్పికొట్టండి

- ఝాన్సీ, అధ్యక్షురాలు : రైతుకూలీ సంఘం
విజయవాడ, సెల్ : 9440319977

1992లో రాష్ట్ర వ్యాప్తంగా మద్యం వ్యతిరేక పోరాటం తీవ్ర రూపంలో వచ్చింది. నెల్లూరుజిల్లాలోని దూబగుంట రోశమ్మ చొరవతో ప్రారంభమైన ఈ పోరాటం రాష్ట్రం అంతా వ్యాపించింది. ఇటీవల కాలంలో మరణించిన దూబగుంట రోశమ్మకు రైతుకూలీ సంఘం (ఆం.ప్ర.) తరపున తీవ్ర సంతాపాన్ని తెలియజేస్తున్నాము. ఈ పోరాటంలో ప్రతి జిల్లాలోనూ నిత్యం వేలాది మహిళలు పాల్గొన్నారు. కొన్ని నెలలుగా సాగిన ఈ పోరాటం పాలకుల గుండెల్లో భయాన్ని పుట్టించింది. 'ఈనాడు' వార్తా పత్రిక ప్రతిరోజూ ఈ పోరాటాల వార్తలను వేస్తూ పెద్ద ఎత్తున ప్రచారం చేస్తూ పోరాటానికి మద్దతు పలికింది. మేధావులు, ప్రజాతంత్రవాదులు, వివిధ ప్రజాసంఘాల నాయకులు ఈ పోరాటానికి పూర్తి మద్దతు పలికారు. ఈ పోరాటంలో రెండు నినాదాలు ప్రధానంగా ముందుకొచ్చాయి. మద్యంపై నిషేధం ప్రకటించాలని కొన్ని సంఘాలు డిమాండ్ చేయగా మరికొన్ని సంఘాలు మద్యం తయారీని పూర్తిగా ఆపివేయాలని డిమాండ్ చేశాయి. 1994లో జరిగిన ఎన్నికల ప్రచారంలో తెలుగుదేశం పార్టీ నినాదం ఇదే ప్రధానమైనదిగా మారింది. ఈ నినాదంతో అత్యధిక మహిళలు ఆకర్షించబడి తెలుగుదేశం పార్టీ అధికారంలోకి రావటానికి దోహదపడ్డారు. అప్పటికి ముఖ్యమంత్రిగా ఎన్నికైన ఎన్.టి. రామారావు మద్యపానాన్ని నిషేధిస్తూ తన తొలి సంతకం చేశాడు. మరికొద్ది కాలానికే ఆ పార్టీలో వచ్చిన ఆంతరంగిక పరిణామాలతో ఎన్.టి. రామారావుని ముఖ్యమంత్రి పదవి నుండి దించివేసి చంద్రబాబు ముఖ్యమంత్రిగా పదవిలోకి వచ్చాడు. ముఖ్యమంత్రి అయిన కొద్దికాలానికే చంద్రబాబు మద్యపానం నిషేధాన్ని ఎత్తివేశాడు. అంచలంచెలుగా పెంచుతూ పోతున్నాడు.

1992 నాటికి మద్యంపై వచ్చే ఆదాయం 98 కోట్లు వుండగా 2005 నాటికి నాలుగువేల కోట్లకు, 2010 నాటికి 12 వేల కోట్లకు, ఆ తర్వాత 18 వేల కోట్లకు పెంచుతూ వున్నారు. 2013-14 నాటికి 27 వేల కోట్ల రూపాయలు ఉన్న ఆదాయం ఇంకా వేల కోట్ల రూపాయల ఆదాయాన్నిపెంచుతూ పోతున్నారు. జనాభా ప్రాతిపదికన ఇంత జనాభాకు ఇంతమంది తాగుతారు అని లెక్కలు వేసి ఎన్ని బార్లు వుండాలి. ఎన్ని షాపులుండాలి, దానికనుగుణంగా ఎంత లైసెన్స్ ఫీజు వసూలు చేయాలి. ఈ విధమైన

టార్గెట్లు పెట్టి మరీ తాగేవాళ్ళ సంఖ్యను పెంచి ఆదాయాన్ని పెంచుకోవటానికి పాలకులు నిరంతరం పథకాలు వేస్తున్నారు. జనవరి 1న నూతన సంవత్సరం రోజున 500 కోట్లపైన మద్యం అమ్మకాలు జరుగుతున్నాయంటే ప్రభుత్వం ఎంత దుర్మార్గంగా యువతను మత్తులో ముంచి జోగిపోయేటట్లు చేస్తుందో అర్థం చేసుకోవచ్చు. మద్యం అమ్మకాలను విరివిగా పెంచాలని ఎక్సైజ్ శాఖకు ప్రభుత్వం ప్రతీ సంవత్సరం టార్గెట్లు పెంచుతున్నారు. ఈ టార్గెట్లకు తగిన ఉత్పత్తిని పెంచటం కోసం డిస్టలరీ ఏర్పాటుకు అనుమతులిస్తూ పోతున్నారు.

టీ, కాఫీ అమ్మకాలు జరుగుతున్న తీరులోనే వెండింగ్ మెషీన్ల ద్వారా వైన్‌లను, బీరులను అప్పటికప్పుడు తయారుచేసి అమ్మకాలు జరిగే విధంగా చూస్తున్నారు. ఈ వెండింగ్ మెషీన్ ప్రస్తుతానికి బెంగుళూరులో మాత్రమే వుంది..

ఈ మద్యం వ్యాపారులు ప్రాంతాలవారీగా సిండికేట్‌లుగా ఏర్పడి అక్రమ మద్యం వ్యాపారాన్ని సాగిస్తున్నారు. మద్యం వ్యాపారస్తులలో నూటికి 70 శాతం ఎమ్మెల్యేలు, ఎం.పీ.లే వున్నారన్న విషయం స్పష్టమే.

ఒక దురలవాటుగా వున్న మద్యం పంచాయితీ, మండల, మున్సిపల్ ఎన్నికలతో ప్రారంభించుకుని అసెంబ్లీ, పార్లమెంటు ఎన్నికలన్నింటిలోనూ ఏరులై పారుతుందన్న విషయం అందరికీ తెలిసిందే. అంతేకాక ఎన్నికల ప్రచారసభలలో అధికార, ప్రతిపక్ష పార్టీలు నిర్వహించే ప్రతీ బహిరంగ సభలోనూ బీరు, బ్రాందీలే. లక్షల రూపాయలు విలువచేసే మద్యం ప్రజలకు అందచేస్తారు. ఎన్నికల సందర్భంగా పేద ప్రజల నుండి ఓటుని లాక్కోవటం కోసం కూడా ఈ మద్యం బాటిల్స్ ముఖ్యపాత్రగా పాలకులు మార్చివేశారన్నది మన కళ్ళ ఎదుట కనపడుతున్న వాస్తవం.

గత కాంగ్రెస్ ప్రభుత్వం హయాంలో మద్యం సిండికేట్‌లపై ఎసిబి దాడులు, ఎమ్మెల్యేలు, మంత్రులు, అధికారులకు మద్యం సిండికేట్‌ల నుండి కోట్ల రూపాయలు లంచాలు అందడం, రాజకీయ నాయకులే మద్యం మాఫీయాలుగా రాష్ట్రంలో చక్రం తిప్పడం ఇవన్నీ వార్తల్లో పెద్దఎత్తున బయటకొచ్చాయి. ఈ కేసులన్నీ వార్తలకు పరిమితమయినాయి. కాని ఎవరు దోపిడీ, ఎవరు లంచగొండి అన్న విషయాలు మాత్రం బయట ప్రపంచానికి వెల్లడి కాకుండా అందరు జాగ్రత్తలు తీసుకున్నారు.

ఈ మద్యం అలవాటుతోటి పేద ప్రజల బ్రతుకులు రోజురోజుకూ అతలాకుతల మవుతున్నాయి.. ఈ మద్యం పేద కుటుంబాల్లోని స్త్రీల జీవితాలను మరింత దుర్భరంగా మార్చివేస్తున్నది. నేటి యువతను ఎంతగానో దిగజార్చుతున్నది.

పేద కుటుంబంలోని పురుషులు తమ సంపాదనలో అధిక భాగం మద్యానికే ఖర్చు పెడుతున్నారు. అసలే తక్కువ ఆదాయాలు, ఆపైన ఈ ఆదాయంలో కూడా సగం మద్యం దురలవాటుకే పోవడంతో ఆ కుటుంబాల్లోని స్త్రీల జీవితాలు రోజురోజుకీ అశాంతిగానూ, అర్ధాకలితోనూ గడుస్తున్నాయి. మహిళలపై మద్యం సేవించి తల్లీ, చెల్లీ అక్కా తేడా లేకుండా దాడులు చేస్తున్న తీరు చూస్తున్నాం. కన్నతండ్రే కసాయిగా మారి కూతుళ్ళపై అత్యాచారం చేసిన సంఘటనలు వెలుగులోకి వస్తున్న తీరు చూస్తే సమాజం సిగ్గుతో తలవంచుకోవలసిన స్థితి. తమ ఉద్యోగం కోసమో, కుటుంబ అవసరాల కోసమో రోడ్లమీదకు వెళ్ళిన మహిళలకు భద్రత లేని స్థితి కూడా ఈ దురలవాటు నుండే వస్తుంది. సామాజిక భద్రతలేనితనం, అనారోగ్యం, పేదరికం, అశాంతి ఈ దురలవాట్ల నుండే సంభవిస్తున్నాయి. కానీ పాలకులు వీటిని ఏమీ గమనంలోకి తీసుకోకుండా వ్యవహరిస్తూ ప్రజాసంక్షేమం కోసం నిత్యం తాము పని చేస్తున్నామని ప్రచారం చేసుకోవటం సిగ్గుచేటైన విషయం.

రాజ్యాంగంలోని 47వ నిబంధన ప్రకారం జూదం, వ్యభిచారం, మత్తుపదార్థాలు, గుర్రపు పందాలు, లాటరీ లాంటివి ప్రభుత్వ ఆదాయ వనరులు కారాదు. రాజ్యాంగానికి కట్టుబడి ప్రజాస్వామిక పద్ధతుల్లో పరిపాలిస్తున్నామని చెప్పుకొంటున్న పాలకులు రాజ్యాంగంలోని నిబంధనలు ప్రక్కకు పెట్టి మద్యం వ్యాపారం ద్వారా వచ్చే ఆదాయమే ప్రధాన వనరుగా చేసుకున్న పాలకులు ప్రజల పట్ల ఇంత బాధ్యతారహితంగా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారనేది స్పష్టమే.

మద్యం అలవాటును ఒక వ్యసనంగానూ, ఒక దురాచారంగానూ చూడటం పాక్షికమే అవుతుంది. వ్యక్తిగత స్థాయిలో చైతన్యపరిస్తే మాత్రమే పరిష్కారమయ్యే సమస్య కాదు. దోపిడీ పాలకుల చేతుల్లో మద్యం ఒక దోపిడీ సాధనంగా మారింది. ప్రజలను నిత్యం మత్తులో వుంచుతూ చైతన్యవంతులు కాకుండా ఉద్దేశ్యపూరితంగానే పాలకులు వ్యవహరిస్తున్నారు. కనుక మద్యపానానికి వ్యతిరేకంగా పోరాటం చేయటం అంటే ఈ పాలకుల దోపిడీ విధానాలకు వ్యతిరేకంగా చేసే పోరాటంలో భాగంగా చేయాల్సిందే తప్ప మరో మార్గం లేదు. అందుకోసం ప్రజలను సన్నద్ధం చేయాలి. సమాయత్తం చేయాలి. తమపై సాగుతున్న ఈ దోపిడీ, పీడనలకు కారకులెవరో గుర్తెరిగే విధంగా సంసిద్ధులను చేయటమే మన కర్తవ్యంగా వుండాలి. ఈ పోరాటాల్లో ఒక భాగమే మద్యపాన వ్యతిరేక పోరాటం.

# 3. కుటుంబానికో రోశమ్మ కావాలి!

– డా. పుట్ల హేమలత, జాతీయ అధ్యక్షురాలు : ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక,
రాజమండ్రి, సెల్ : 8500496117

స్త్రీలు తలచుకుంటే ఏదైనా చేయగలరు. దేన్నైనా సాధించగలరు. పట్టుదల, సామాజిక బాధ్యత ఉండాలే కానీ ఏ స్థాయి వారైనా నిబద్ధతతో అవినీతి, సమాజ రుగ్మతలపై పోరాటం చేయగలరు అని నిరూపించిన శక్తి పేరు దూబగుంట రోశమ్మ.

నెల్లూరు జిల్లా జలదంకి మండలం, గట్టుపల్లి చింతల పాలెంలోని జక్కంపూడి పిచ్చయ్య, సుబ్బమ్మల మూడో సంతానం రోశమ్మ. కలిగిరి మండలం తూర్పు దూబగుంటకి చెందిన వర్ధినేని కొండయ్యతో ఆమెకు వివాహమైంది. భర్త చనిపోతే కుంగిపోకుండా ఇద్దరు కొడుకులను కష్టపడి పెంచి పెద్ద చేసింది. వారు ప్రయోజకులు కావాలని కన్న కలలన్నీ కళ్ళముందే కూలిపోయి కొడుకులిద్దరు మద్యానికి బానిసలయ్యారు. తనలాగే ఈ తాగుడు మహమ్మారి వల్ల గృహహింస, మానసికమైన బాధలు మరే మహిళకు రాకూడదని, అక్షరదీపం కార్యక్రమంలో తను చదువుకున్న సీతమ్మ కథనే స్ఫూర్తిగా తీసుకుని మద్యపానం నిషేధం దిశగా ఆందోళన చేపట్టింది రోశమ్మ.

చిన్న మొలకగా పదిమంది మహిళలతో కలిసి ప్రారంభించిన ఉద్యమం నెల్లూరు జిల్లా ఎల్లలు దాటి రాష్ట్రం మొత్తాన్ని ఈ ప్రభంజనం ఒక ఊపు ఊపేసింది. సంపూర్ణ మద్యపాన వ్యతిరేకోద్యమంగా రూపు దిద్దుకుంది. ఎన్.టి.ఆర్. నాయకత్వంలో ప్రభుత్వ ఏర్పడగానే మద్యపాన నిషేధం ఫైల్ మీద మొదటి సంతకం చేయడం విశేషం.

కొంతకాలం తర్వాత ప్రభుత్వంలో జరిగిన మార్పుల వల్ల తిరిగి అమ్మకాలు మొదలై మద్యం ఏరులై పారింది. ఇప్పుడు చాలామంది మహిళలతో పాటు పురుషులు కూడా మద్యపాన నిషేధానికి మద్దతు పలుకుతున్నారు.

ముచ్చటైన కుటుంబాల్లో మద్యం రక్కసి చిచ్చు పెడుతూ, కుటుంబాలను సర్వనాశనం చేస్తున్నా, శరీరాలను ఛిద్రం చేస్తున్నా... ప్రాణాలను హరిస్తున్నా... తాగే వారు తాగుతూనే వున్నారు. గ్రామ ప్రాంతాల్లో రహస్యంగా చవక మద్యాన్ని తయారుచేసి, తక్కువ ధరలకు అమ్మటంతో పేద ప్రజలు తాగుడికి అలవాటు పడుతున్నారు. నాణ్యతా ప్రమాణాలను పాటించకుండా రసాయనాలను కలిపి కల్తీ మద్యం అమ్మటం వల్ల మరణాలు కూడా కలుగుతున్నాయి.

రోజంతా కష్టపడి కూలిచేసి డబ్బులు తెచ్చుకుని కలోగంజో కాచుకునే సమయానికి వారి భర్తలు దౌర్జన్యంగా కూలీ డబ్బులు లాక్కొని తాగుడికి ధారపోస్తున్నారు. మద్యానికి బానిసలై ఒళ్ళు గుల్ల చేసుకుంటున్న పురుషుల పరిస్థితులు, వారి వల్ల గృహ హింసలకి, ఆర్థిక అభద్రతకి గురవుతున్న స్త్రీల దీన గాథలు ప్రభుత్వానికి పట్టవు. ప్రభుత్వం రకరకాల పేర్లతో కొత్త పథకాలు ప్రారంభించి మద్యం దుకాణాలకి లైసెన్స్‌లు ఇచ్చి బాగానే ఖజానా నింపుకుంటున్నారు. సామాన్య పేద ప్రజలు కూడా నెలకు మూడువేల రూపాయలకు పైగా మద్యానికి ఖర్చు పెడుతున్నారు.

మారుమూల గ్రామాలలో, అడవులలో వ్యర్థ పదార్థాలతో రసాయనాలతో తయారుచేసే నాటు సారా వల్ల ఎంత మంది ప్రాణాలు కోల్పోతున్నారో అందరికీ తెలిసిందే. చట్టాల్లోని చాటున మద్యం దందా విశృంఖలంగా శాఖలుగా విస్తరిస్తూ వుంది. ఏజెన్సీ ప్రాంతాలలో గిరిజనులు అధికారికంగా నాటు సారా తయారు చేయవచ్చు. అయితే పరిమితికి లోబడి సొంత కుటుంబం కోసం, అవసరాల కోసం మాత్రమే వాడుకోవాలి. ఏజన్సీ ప్రాంతాలలో ఇది నేరం కాదు కాబట్టి పట్టణ ప్రాంతపు దళారీలు గిరిజన ప్రాంతాలకు వెళ్ళి నాటు సారా తయారీ మారు బేరాలకి కొని గ్రామాలకు సరఫరా చేస్తుంటారు. ఈ విషయం ఎక్సైజ్‌వారికి తెలిసినా పట్టించుకోరు.

ఏ రకమైన మద్యం అయినా మొదట్లో స్నేహితుల కోసం వ్యాపార లావాదేవీలలో ఎదుటి వారిని సంతోషపెట్టడం కోసం ఒక అలవాటుగా మొదలవుతుంది. తొలి నాళ్ళలో సరదాగా అనిపించినా క్రమేణ అదొక వ్యసనంగా మారిపోతుంది. కొన్నాళ్ళకి మానసికంగా శారీరకంగా పతనమౌతాడు. అతిగా తాగటం వల్ల జేబు ఖాళీ అవ్వటం, ముందు ఇంట్లోను ఆ తర్వాత బయట దొంగతనాలకి పాల్పడతారు. ఎదుటి వారితో మనసు విప్పి మాట్లాడలేరు. కొద్ది పరిచయం వున్నా వారి దగ్గర కూడా అప్పులు చేయడం. కంట్రోల్ తప్పి డ్రైవింగ్ చేయటం ప్రమాదాల పాలవటం ఉద్యోగాలు పోగొట్టుకోవటం వంటి పరిస్థితులకు లోనవుతారు. మరి కొంతమంది రోజుకి కొద్ది పరిమాణంలో మద్యం తీసుకుంటే గుండె జబ్బులు రావని అందుకే తాము తాగుతున్నామని కారణాలు చెబుతారు. కానీ మద్యంలో వుండే మాల్ట్ షుగర్ వల్ల శరీరంలో అధిక శాతం కొవ్వు చేరుతుంది. బి.పి. పెరిగి గుండెపోటు వచ్చే అవకాశాలు చాలా ఎక్కువగా ఉంటాయి. లివర్ వ్యాధులు, మూర్ఛ, నరాల బలహీనత లైంగిక లోపం అకాల మరణాలు మానసిక వైకల్యం క్యాన్సర్ వంటి వ్యాధులతో మరణించే అవకాశాలు ఎక్కువగా వున్నాయి.

యువకులు మద్యానికి అలవాటు పడితే అదొక వ్యసనంగా మారితే వారి జీవితమే అస్తవ్యస్తమౌతుంది. తల్లిదండ్రులు తమ పిల్లల ప్రవర్తనని గమనిస్తూ వుండాలి. వారు ఏ

సమయానికి ఇంటికి వస్తారు. వారికి ఎటువంటి స్నేహితులున్నారనే విషయాలను గమనిస్తూ వారికి స్నేహపూర్వకమైన సంభాషణల ద్వారా చెడు అలవాట్ల వల్ల వచ్చే నష్టాలను చెబుతుండాలి. తల్లిదండ్రులు మద్యపానం చేసే వారైతే వారి పిల్లలు కూడా ఆ వ్యసనానికి గురయ్యే అవకాశం 4-10 రెట్లు ఎక్కువ.

ఎక్సైజ్ శాఖ ఆల్కో పాప్ డ్రింక్‌ని మద్యం విభాగంలోకి చేర్చింది. దీనిలో పళ్ళ రసంతో పాటు 4.8 శాతం ఆల్కహాల్ వుంటుంది. ఇది రకరకాల ఫ్లేవర్లలో దొరుకుతుంది. యువత ఈ డ్రింక్స్‌కి అలవాటుపడి మెల్లమెల్లగా మద్యపానంలోకి దిగిపోతున్నారు. చాలా దేశాల్లో ఆల్కోపాప్స్ నిషేధించారు.

అతిగా మద్యం సేవిస్తే శరీరంలోని ప్రతి అవయవాన్ని నాశనం చేస్తుంది. మెదడుపై ప్రభావం చూపించి మానసిక, శారీరక సమతుల్యతను దెబ్బతీస్తుంది. తాను బాధపడటమే కాక తమతో జీవించే వారికి కూడా మనశ్శాంతి లేకుండా చేస్తుంటారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ తేల్చిన లెక్కల ప్రకారం ప్రపంచ వ్యాప్తంగా 140 మిలియన్ల మద్యపానం సేవించేవారు వున్నట్టు తేల్చింది. ఎంతోమంది విపరీతమైన తాగుడికి లోనై ఆ సమయానికి మద్యం దొరకకపోతే విపరీతమైన లక్షణాలను ప్రదర్శిస్తారు. ఆత్మహత్యలకు కూడా పాల్పడతారు.

సామాజికంగా ఎన్నో అవమానాలను ఎదుర్కోవలసి వస్తుంది. ఆ మత్తులో గృహాలలో స్త్రీలను హింసించటం బాలలపై లైంగిక వేధింపులు వంటి వాటికి పాల్పడి ఇతరుల జీవితాలను నాశనం చేయడమే కాకుండా తాము జైలు పాలవటం ఉరిశిక్షలు కొని తెచ్చుకోవటం కూడా జరుగుతుంది.

మద్యానికి బానిసలైన వారితో ఆ అలవాటు మాన్పించటానికి కొట్టటం, తిట్టటం లాంటి మొరటు పద్ధతులను ఎంచుకోవటం వల్ల ప్రయోజనం వుండదు. డీఎడిక్షన్ క్యాంపులు, రీహాబిలిటేషన్ సెంటర్లు, కౌన్సిలింగు, వైద్యుల పర్యవేక్షణలో ఒక పద్ధతి ప్రకారం దశల వారీగా ఈ అలవాటు మాన్పించాలి..

మద్యం వాడకాన్ని అకస్మాత్తుగా నిలిపేస్తే, ఆ వ్యక్తి నాడీ వ్యవస్త విపరీత పరిణామాలకి గురై మానసిక అలజడి, ప్రాణభయం, మతిభ్రమించడం, వణుకు, జ్వరం, హార్ట్ ఫెయిల్యూర్ వంటివి సంభవించవచ్చు.

ఎక్కడ అత్యాచారాలు జరిగినా, హత్యలు, రోడ్డు ప్రమాదాలు, అల్లర్లు... పండుగలు, వేడుకలు, వీటితో బాటు ఎలక్షన్లు... అన్నిటి వెనుక మద్యం వుంటూనే వుంది.

సాహిత్యంలో మద్యం వల్ల కలిగే అనేక నష్టాలని కవితలు, పద్యాలు, కథల్లో ఎంతోమంది రాసారు. ఇక్కడ నేను కుసుమ ధర్మన్న కవి గురించి ప్రస్తావించక తప్పదు. ధర్మన్న తొంభయ్యేళ్ళ క్రితం దళితుల కోసం కుల నిర్మూలన, మద్యపాన వ్యసనంపై అనేక రచనలు చేసిన దళిత ఉద్యమకారుడు. 1930లో మార్చిలో 'తూర్పు గోదావరి జిల్లా మద్యపాన నిషేధ సంఘం' వారు పెట్టిన వ్యాస రచన పోటీలో బంగారు పతకాన్ని గెల్చుకున్నాడు. 1930లో 'హరిజన శతకము' రాసాడు. దాన్లో మద్యానికి బానిసలైన దళిత జనాంగాన్ని హెచ్చరిస్తూ ఎన్నో పద్యాలు రాసాడు.

"త్రాగుడు మానుము జెరచును
త్రాగుడు దుర్మార్గు జేయు ద్రవ్యము బాపున్
త్రాగుడు పాపము గూర్చును
త్రాగుడు సుగుణములనెల్ల దగ్ధము జేయున్",

"కల్లుత్రాగి పిల్లజెల్లల నేడ్పించి
ముల్లె మూటల నెల్ల చెల్లజేసి
యిల్లు వళ్లు నేలగుల్ల చేసెదవా కొ?
ఆలకింపుమయ్య హరిజనుండ"

త్రాగుడు రంకు బొంకులకు రాజట
కన్నము కలహములకు కన్న తల్లి
కూ(ఖూ)నీలకు కుల దేవత
పాపములకు పుచ్చపాదు
భూత ప్రేత పిశాచములకు హుషారు
అమ్మ వారి కొలువులకు బలే జోరు"

కుసుమ ధర్మన్న ఆయుర్వేద వైద్యుడు కూడా కావటం వల్ల మద్యం వల్ల జరిగే చెడుని చెప్పేవాడు.

"మద్యం ఆహారం కానీ, ఔషధం కానీ కాదు. ఆయుర్ధాయాన్ని తగ్గిస్తుంది. మానవ శరీరంలో 75 శాతం నీరు అవసరమై వుంటే మద్యపానం వల్ల శరీరంలోని నీరు హరిస్తుంది. స్పర్శజ్ఞానం నశిస్తుంది, ప్రాణవాయువు హరించుకుపోతుంది. కడుపులోని సున్నిత భాగాలు కందిపోయి పుండు పడతాయి. వార్తా పత్రికల్లో కొన్నిరకాల మద్యం బలాన్నిస్తుందనీ, జీర్ణశక్తినిస్తుందనీ ఆర్భాటంగా ప్రకటిస్తారు. కానీ మద్యం కంటే పాలు, పెరుగు చల్ల ఆరోగ్యానికి మంచివ"ని తొంభయి ఏళ్లనాడే హెచ్చరించాడు ధర్మన్న.

ఇన్ని అనర్థాలకు కారణమవుతున్న మద్యాన్ని నిషేధించటానికి మన భారత ప్రభుత్వం ఏం చేసింది? లేదా ఏం చేయబోతుంది?

రాష్ట్రంలో మద్యపానం నిషేధం సాధ్యం కాదని మన ముఖ్యమంత్రి చంద్రబాబు 2007 లోనే ప్రకటించేశారు. ఆ వార్త వివరాలు చూడండి.

అనంతపురం జిల్లా హిందూపూర్‌లో శుక్రవారం ఆయన మీడియాతో మాట్లాడుతూ.. మద్యపానంపై ఇప్పటికే తమ పార్టీ వైఖరిని వెల్లడించామన్నారు. సంపూర్ణ మద్యపానం సాధ్యం కాదని అయితే బెల్టుషాపులు, చీఫ్ లిక్కర్, నాటు సారాను నిర్మూలించవలసిన అవశ్యం ఉందన్నారు.

దీన్ని బట్టి మద్యం తాగాలి అనుకునేవారు ఖరీదైన బార్ల వెంట పరుగులు తీయాలి. లేదా ఖరీదైన మనుషులే ఆరోగ్యాలు పాడు చేసుకోవాలి.

మరొకవైపు తెలంగాణాలో నిజామాబాద్ ఎం.పి. కల్వకుంట కవిత పోయిన ఏడాది ఇలాంటి ప్రకటనే చేసారు. మద్యపానం నిషేధించడం ప్రభుత్వాల బాధ్యత అయినప్పటికీ దీనిని పూర్తిగా రూపుమాపడం సాధ్యం కావడం లేదనీ, గతంలో కేరళ రాష్ట్రంలో మద్యపానాన్ని నిషేధించినా సంపూర్ణంగా అమలు కాలేదని ముందే గుర్తు చేసారు.

“గ్రామాల్లో 70 శాతం కుటుంబాల్లో గుడుంబా తాగి ఇంటిపెద్ద చనిపోయి మహిళలు వితంతువులుగా మారడం, జరుగుతున్న అనర్థాలు, చాలామంది అనారోగ్యం పాలవ్వడం, మృతి చెందడం తమను కలిచివేసిందని గుడుంబా తాగవద్దని ప్రజలను చైతన్యవంతులను చేయడానికి వరంగల్ ప్రాంతంలో తెలంగాణ జాగృతి ఆధ్వర్యంలో కార్యక్రమాలు నిర్వహిస్తున్నాం. అయినా మద్యపాన నిషేధం సాధ్యం కాదు కాబట్టి, గుడుంబా నియంత్రించడానికి ప్రభుత్వం ఆరోగ్యవంతమైన, తక్కువ ధరకు లభించే మద్యాన్ని ప్రవేశపెట్ట బోతుందని” ప్రకటించారు. చీప్ లిక్కర్ ద్వారా గుడుంబా నియంత్రణ సాధ్యం కాకపోతే ప్రతిపక్షాలు చేసే విమర్శలతో తాను ఏకీభవిస్తానని కూడా ఛాలెంజ్ చేసారు.

2015 డిసెంబర్‌లో బీహార్ ప్రభుత్వం ఒక సంచలనాత్మకమైన నిర్ణయం తీసుకుంది. మద్యం దుకాణాలలో బ్రాంది విస్కిలకు బదులు పాలు పాల పదార్థాలు అమ్మటానికి మద్యం వ్యాపారులతో చర్చలు జరిపింది. 2016 ఏప్రిల్ నుంచి దశల వారీగా మద్య నిషేధం అమలుకు చర్యలు చేపట్టింది. మద్యం షాప్‌ల యజమానులు నష్టపోకుండా పాల ఉత్పత్తుల అమ్మకాలను ప్రోత్సహించింది. మద్యం అమ్మకాలతో రోజుకి వేలల్లో లాభాలు కళ్ళచూసే వ్యాపారులకి స్వీట్స్ అమ్మితే వచ్చే వందలు రుచిస్తాయా?

ఒక సామాజిక ఉద్యమంగా మద్య నిషేధ ప్రచారాన్ని మహిళా సహకారంతో మద్యం తయారీదారులపై చెక్ పెట్టారు. సమాజం దృష్టికి ఈ వ్యవహారమంతా ఎంతో ఆదర్శవంతంగా కనిపిస్తూ ఉన్నా అసలు లొసుగు బట్ట బయలుగానే వుంది. బీహార్‌లో మద్య నిషేదం వల్ల ఏడాదికి 3500 కోట్ల ఆదాయం పోతుంది. కాబట్టి సంపూర్ణ మద్య నిషేధం కేవలం గ్రామాల్లోనే అమలు చేస్తూ నగరాల్లో వైన్ అమ్మకాలు జరుపుతామని అధికారులు చెప్పారు.

దేశంలో మద్యపానంపై నిషేధం విధించిన రాష్ట్రాల్లో బీహార్ నాలుగోస్థానంలో వుండగా, గుజరాత్, నాగాలాండ్, మిజోరంలలో సంపూర్ణ మద్యపాన నిషేధం అమలులో ఉంది. గుజరాత్, కేరళ రాష్ట్రాల్లో మద్యపానాన్ని తగ్గించే విధంగా మద్యనిషేధం అమలు చేస్తుంటే మన రాష్ట్రంలో మద్యం అమ్మకాలు పెంచటం విచారం.

మూడు దశాబ్దాల క్రితమే మద్య వ్యతిరేక పోరాటం నెల్లూరులో మొదలు పెట్టిన పేరు రోశమ్మకీ, నెల్లూరుకీ మిగిలింది కానీ ఆ ఉద్యమం ముందుకు నడిపే మరో రోశమ్మ తయారు కాలేదు. తన ఆశయం నెరవేరకుండానే దూబగుంట రోశమ్మ మరణించింది. మద్య నిషేధ ఉద్యమంతో దేశ, రాష్ట్ర స్థాయిలో ప్రత్యేక గుర్తింపు పొందిన రోశమ్మ మరణశయ్యపై వుండి కూడా సంపూర్ణ మద్య నిషేధమే తన చివరి కోరికని చెప్పడం ఆమె ఉద్యమ స్ఫూర్తిని తెలియజేస్తుంది. ఇప్పుడు మనకు కుటుంబానికో రోశమ్మ కావాలి.



**"మద్య నిషేధానికి సంబంధించిన చర్చ వ్యవస్థలో ఎప్పుడు తలెత్తినా వీలైనన్ని వేషాలు వేసి దాన్ని తెలివిగా పక్కదారి పట్టించే ప్రయత్నాలు విజయవంతంగా జరుగుతుంటాయి కాబట్టే, ఈరోజు మద్య నిషేధమనేది ఒక అసాధ్యమైన, ఆచరణా సాధ్యం కాని జటిల విషయంగా మనకి కనబడుతోంది."**

# 4. మహిళలకు సమానత్వం సాధ్యమేనా?

– మళ్ల స్వరూప, జనవిజ్ఞాన వేదిక (ఏ రాజకీయ పార్టీకి అనుబంధం కాదు)
విజయనగరం, సెల్ : 9491271151

ఆదిమ సమాజం నుండి ప్రస్తుతం వరకూ పరిశీలిస్తే శాస్త్ర సాంకేతిక రంగాలలో అభివృద్ధి సాధించింది. మనిషి తన పనిని సులువుగా చేసేందులకుగానూ, వేగంగా చేసేందులకు సైన్సు అన్ని రకాలుగానూ మానవాళికి ఉపయోగపడింది. ప్రత్యేకంగా విద్య, వైద్య రంగాలలో అనేక ఆవిష్కరణలు గావించబడ్డాయి. అవన్నీ ఎక్కువగా మానవాళికి ఉపయోగపడితే, కొద్దిగా నష్టాన్ని కూడా భరించవలసి వచ్చింది.

**ప్రాచీన కాలంలో మహిళలు :**

ఆదిమ సమాజంలో మహిళలే ప్రధానమైన నిర్ణయాత్మక పాత్రలలో ఉండేవారు. మాతృస్వామ్య పాలన కొనసాగేది. అందువలననే మనకు ఆదిశక్తి, దుర్గాదేవి, అమ్మవారలుగానూ, ఎక్కువగా స్త్రీలనే దేవతలుగా ఆరాధించే సంస్కృతి ప్రాచీన కాలంలో కొనసాగింది.

ఆ కాలం నుండి ఇప్పటివరకు సైన్సు అద్భుతంగా పెరిగింది. సైన్సుతో పాటు మన పరిణామక్రమంలో చాలా మార్పులు జరిగాయి. ఈ మార్పులు మనం పరిశీలించి నట్లయితే వైద్యరంగంలో, ఆరోగ్య రంగాలలో, సాంస్కృతిక రంగాలలో, జీవన పరిస్థితులలోనూ ఎక్కువగా అభివృద్ధివైపే సాగాయని చెప్పవచ్చు. మహిళలు, పురుషులతో పోలిస్తే పట్టుదలలోనూ, ఓర్పులోనూ, తెలివితేటల లోనూ పురుషులకు ఏమాత్రం తక్కువకారని అనేక సందర్భాలలో నిరూపించబడిన సత్యం.

సమాజంలో సగభాగమైన మహిళలు తరతరాలుగా అణచివేతకు గురి అవుతూనే వున్నారు. ఆ అణచివేత నుండితమ పోరాటాలతోనే విజయం సాధించి ఈనాటి స్థితికి చేరుకోవడం జరిగింది. మన దేశంలో ఇంకా సంస్కృతి, సాంప్రదాయాల పేరుమీద జరుగుతున్న వ్యవహారాలు ఈ పరిస్థితికి ఒక కారణం అయితే మహిళల ఉదాసీనత మరొక కారణంగా చెప్పుకోవచ్చు. సమాజంలో రెండే వర్గాలు ఉన్నప్పుడు, ఒక వర్గ ఆధిపత్యం ఎంతవరకు సబబు? ఏదో ఒక సంఘటన జరిగినప్పుడే స్పందించే వ్యవహారం, నిర్ణయాలు తీసుకోవడం ఆనవాయితీగా మారిపోయింది. మహిళలను అసభ్యంగా చూపించే నైజాన్ని, బలహీనులుగా చూపించే తత్వాన్ని ఎండగట్టాలి.

మహిళలు, రాజకీయాలలోనూ, పారిశ్రామిక వేత్తలుగానూ సాహితీవేత్తలుగానూ, శాస్త్రవేత్తలుగానూ, విద్యావేత్తలుగానూ తమ ప్రతిభను వివిధ రంగాలలో నిరూపించు కుంటున్నారు. వారందరి ప్రాధాన్యత తమ వర్గ మహిళలు అన్ని రంగాలలో ముందుకు వచ్చేటట్లు నిరంతరం ఆలోచన చెయ్యాలి. సమాన హక్కులు కల్పించే వరకు పోరాడాలి. అలా జరిగిననాడు ఈనాడు సమాజంలో ఉన్న ఎన్నో సమస్యలకు పరిష్కారాలు దొరుకుతాయి. ముఖ్యంగా ప్రజాప్రతినిధులుగా ఉన్న మహిళలు, మహిళా హక్కుల పట్ల నిరంతర పోరాటంచేస్తూ వుండాలి. 50 శాతం రిజర్వేషన్ కల్పించాలి. మహిళలకు స్వయం నిర్ణయాధికారాలివ్వాలి. మహిళల గౌరవాన్ని పెంచే సమాజ స్థాపనకు అందరూ కృషి చేయాలి.

మన ప్రజాస్వామ్యంలో ప్రజాప్రతినిధులలో, ఉద్యోగాల్లో అన్నింటా 30% రిజర్వేషన్ మహిళలకు ఉంది. కాబట్టి ఫర్వాలేదులే మహిళలు బాగుపడిపోతారు అనుకుంటే మనం భ్రమల్లో బ్రతుకుతున్నట్లే. నూటికి 70% మహిళా రిజర్వేషన్‌లో ఎన్నికైన మహిళలు వారివారి సీట్లలో కూర్చోవటం లేదు. వారి బదులు వారి పతిభక్తికి ప్రతిరూపాలైన భర్తలు కూర్చోవడం మనం చూస్తూ ఉన్నాం. 95% వరకూ ఎన్నికైన మహిళా ప్రజాప్రతినిధులలో భర్తలే జులుం చెలాయించడం ఈ సమాజంలో నున్న అరిష్టం.

ప్రస్తుత సమాజంలో పురుషాధిక్యత కొనసాగుతూ ఉంది. కొన్ని వేల సంవత్సరాల ఆధిపత్యం వెంటనే మారిపోతుందా... అంటే కొంచెం కష్టమే. ముఖ్యంగా మహిళలు ఉపన్యాసకులుగా మారాలి, చైతన్యానికి ప్రతీకలుగా మారాలి. మానసికంగా బలవంతులుగా మారాలి. సైన్సు అభివృద్ధి అయినాసరే మహిళల పట్ల అనుసరిస్తున్న సంప్రదాయాలు మహిళలకే శత్రువులుగా మారాయి.

మహిళలంటే ఇలానే ఉండాలి. పెళ్ళయిన మహిళ మెడలో తాళిబొట్టు ఉండాలి. నుదుట కుంకుమ బొట్టు ఉండాలి. కాలికి మట్టెలు ఉండాలి. ఇంకా కొన్ని ఆచారాలలో అయితే మహిళ ముఖానికి ముసుగు వేసుకోవాలి. మహిళలు పురుషులతో మాట్లాడకూడదు. మహిళలే జడలు, నగరం, పువ్వులు ధరించాలి. మహిళలు మేకప్ చేసుకుని తీరాలి. గోళ్లకు రంగు, ముఖానికి స్నో, పెద్దదో చిన్నదో బొట్టు యివి లేకపోతే మహిళలను తోటి సమాజం గౌరవించడం లేదు.

అన్ని మతాలు మహిళలుగాని, పురుషులుగాని మానవత్వంతో ఉండాలని చెప్పాయే గాని మిగతావన్నీ మనం కల్పించుకుని చేస్తున్నవే. ఆ కల్పితాలు ఎక్కువైపోయి అస్సలు కంటే కొసర్లే ఎక్కువైపోయినట్లు మహిళలకు ప్రతిబంధకాలుగా మారిపోయాయి. ఈరోజు

ఏ పాఠశాలలో చూసినా బాలికలే బాగా చదువుచున్నట్లుగా మన లెక్కలు చెపుతున్నాయి. అన్నిటిలో సమానంగా నున్న మహిళలు, పురుషులతో సమానంగా ఎందుకు చెలామణీ కాలేకపోతున్నారు... అని ఆలోచిస్తే ఎక్కడైతే మహిళలకు ఆర్థిక స్వాతంత్ర్యం ఉంటుందో అక్కడ మహిళ అభివృద్ధి చెందినట్లే. శాస్త్రపరంగా చూచినా ఇద్దరూ ఒక్కటేనని అనుకున్నా ఆర్థికంగా బలపడితేనే మహిళలు సమానత్వం సాధించగలరు.

ఒకవైపు ఆగష్టు 2016లో జరిగిన రియో ఒలింపిక్స్ భారతదేశపు కీర్తి కిరీటాన్ని ప్రపంచానికి చాటి చెప్పిన ఘనత పి.వి. సింధు, సాక్షిమల్లిక్‌లు మహిళలే కావడం ఖచ్చితంగా సమానత్వం దిశగా మనం పయనిస్తున్నట్లే. కాని ధనిక వర్గపు స్త్రీల లాగా క్రింది వర్గాల స్త్రీలకు అంటే పేద, బడుగు, బలహీనవర్గాల కుటుంబాలలోనున్న స్త్రీలు యిప్పటికీ గ్రామీణ ప్రాంతాలలో బానిసలుగానూ, పురుషుల చేతిలో కీలుబొమ్మలుగానూ ఉన్నారు.

దీనికి ప్రధాన కారణం మద్యం అని మనం చెప్పవచ్చు. ప్రభుత్వ వేలం పాటలు నిర్వహించి అమ్ముతున్న మద్యం ఎక్కువగా కష్టజీవులు, రైతులు, వ్యవసాయ కార్మికులే తాగి తమ మత్తులో కుటుంబాలను నాశనం చేసుకోవడం దీనిలో భాగమే. ఈ మద్యాన్ని నిషేధించిన సమయంలో పొదుపు సంఘాల్లో ధనం విపరీతంగా జమ అయినట్లు కీ॥శే॥ యన్.టి.ఆర్. గారి ప్రభుత్వంలో మన కళ్లారా చూశాం. ఈనాటి ప్రభుత్వాలు సగటు గ్రామీణ స్త్రీల దైనందిన జీవితాల గురించి ఏమాత్రం ఆలోచించినా మద్య నిషేధం అమలు పరిచేవారు. అలా చేయకపోవడమే స్త్రీల పాలిట శత్రువుగా మారింది. యిప్పటికైనా మహిళా సంఘాలు, మహిళా సంక్షేమం కోరే అభ్యుదయ సంఘాలు మహిళలను చైతన్యపరిచి, మద్య నిషేధంకై పోరాటం చేసేటట్లుగా చెయ్యగలిగితే మహిళల సమానత్వం సాధించినట్లే.

దానికిగానూ, మహిళలు చదవాలి, కష్టపడాలి, ఉద్యోగాలు సాధించాలి, ఆర్థికంగా బలపడాలి.... ఎవరెన్ని మాట్లాడినా ఆర్థిక బలంతోనే మిగతా బలాలు వస్తాయన్నది బహిరంగ రహస్యం. ప్రభుత్వాలు ఆ దిశగా ఆలోచించి, అమలుకు ప్రయత్నిస్తే ఇది సాధ్యమే.

# 5. మద్య నిషేధంపై ఎందుకింత అలసత్వం?

– డా॥ డి.ఎల్. విద్య, జనవిజ్ఞాన వేదిక, కాకినాడ
సెల్ : 9246691476

ఆగస్టు 7, ఆదివారం, 2016న మద్యపాన వ్యతిరేక ఉద్యమాన్ని మహోజ్వలంగాను, చారిత్రాత్మకంగానూ, ఆంధ్రప్రదేశ్‌లో నడిపించిన 'దూబగుంట రోశమ్మ' చనిపోయారు. ఆమె చనిపోకముందే ఉద్యమం నీరసించిపోయింది. కష్టాల నుంచీ, కన్నీళ్ళ నుంచే ఉద్యమాలు వస్తాయి. అవి అప్పటి పరిస్థితులని, ప్రజా చైతన్యాన్ని బట్టి ప్రజ్వలించనయినా ప్రజ్వలిస్తాయి, నీరసించనయినా నీరసిస్తాయి, కాని ఉద్యమాలు ఎప్పుడూ మరణించవు. సమస్య తీరిపోతే అవి చరిత్రలో స్థానాన్ని పొందుతాయి, తీరకపోతే బలహీనంగానయినా ఉద్యమం కొనసాగుతుందే తప్ప మరణించదు. 1990ల్లో ఆ చారిత్రాత్మక ఉద్యమంలో పాల్గొన్నవారు నిరక్షరాస్య, పేద, దిగువ మధ్య తరగతి మహిళలు – మద్య నిషేధాన్ని ఎజెండాగా పెట్టి ప్రభుత్వాన్నే మార్చేశారు. చిత్తశుద్ధిలేని అన్ని రాజకీయ పార్టీలూ ఉద్యమానికి మద్దత్తునిచ్చేయి. 1995లో ఎన్.టి.ఆర్. ముఖ్యమంత్రి అయి 'మద్య నిషేధాన్ని' విధించాడు. ప్రభుత్వాలు చేసే పనులు ఎలగూ చిత్తశుద్ధి లేనివే అయి ఉంటాయి కాబట్టి, చంద్రబాబు హయాంలో నిషేధం, రెవెన్యూ తగ్గిపోతోందనే నెపంతో చెత్తలోకి పోయింది. కుటుంబాలు ఆర్థికంగా చితికిపోతూ ఉండడం, అనారోగ్యాలకి, అప్పుల పాలవుతూ ఉండడం, తాగిన మొగుడి చేతక్రమం తప్పకుండా తన్నులూ, తిట్లూ తింటూ ఉండడం, అనుమానాలలో అవమానాల పాలవుతూ ఉండడం, ఉద్యమానికి దారితీసిన అప్పటి ఆ మహిళల హృదయ వేదనలు. అప్పుడే కాదు, ఇప్పుడూ ఆ మహిళల పరిస్థితి అలాగే ఉంది. 'మద్యపాన నిషేధ కాలంలో మాత్రం కొద్ది రోజులు వారి జీవితాల్లో చిరునవ్వు తొంగి చూసింది. ఒక మంచి పని జరిగితే దాని ఫలితం తప్పకుండా కనిపిస్తుంది. మంచి తాత్కాలికం అయితే ఫలితమూ తాత్కాలికమే, మంచి శాశ్వతం అయితే, ఫలితమూ శాశ్వతమే.

ఈ 21వ శతాబ్దంలో మద్యపాన ఉపద్రవాలకి, జత కలిసిన మరొక ఉపద్రవం 'సోషల్ డ్రింకింగ్'. సోషల్ డ్రింకింగ్‌కి వ్యతిరేకంగా గళం ఎత్తుతున్నవాళ్ళు విద్యాధిక, ఎగువ మధ్యతరగతి యువతులు.

బొంబాయిలో పనిచేస్తున్న అరుణ ఎమ్.బి.ఏ. తాగుడు అలవాటు లేని వరుణ్ణి కోరుకుంటోంది. అమెరికాలో చదువుతున్న కంప్యూటర్ ఇంజనీరు మనోజ్ఞ కూడా 'వరుడి గురించి నాకు పెద్ద పెద్ద కోరికలు లేవమ్మా, మద్యం రుచి కూడా తెలియని వాడయితే చాలు' అంటోంది. విశాఖపట్నం వైద్య విద్యార్థిని డాక్టర్ అమృత "పెళ్ళి గురించి నాకేం

గొంతెమ్మ కోరికలు లేవమ్మా, ఇంతవరకు ఎన్నడూ తాగని వాడు, భవిష్యత్తులో కూడా మద్యం ముట్టనని ప్రమాణం చెయ్యగలిగేవాడు భర్తగా కావాలి" అంటుంది. బెంగుళూరు సాఫ్ట్‌వేర్ ఉద్యోగిని సృజన అంటుంది, "తాగని వరుడు కావాలి అనుకోవడం గొంతెమ్మ కోరికేం కాదు, నేను పార్టీల్లో చూస్తూ ఉంటా కదా, సగం మందే తాగుతారు, సగం మంది తాగరు" అంటుంది. (సగం గ్లాసు ఖాళీ అనకుండా, గ్లాసులో సగం వరకూ నీరుంది" అనే ఆప్టిమిస్టు లాంటిది ఈ పిల్ల) ఆమెకి కూడా కావలసిన పెళ్ళినాటి ప్రమాణం – వరుడి నుంచి 'తాగను' అన్న భరోసానే. ఇలాగే ఎంతోమంది ఉన్నారు "తాగే మొగుడు మాకొద్దు బాబోయ్" అని మొత్తుకునే మహిళామణులు. వీళ్ళంతా పెద్ద చదువులు చదువుకుని, పెద్ద పెద్ద జీతాలతో, పెద్ద పెద్ద ఉద్యోగాలు చేసేవాళ్ళే. వీళ్ళంతా గుర్తించారు, సంసార జీవన మాధుర్యాన్ని ఆ చేదు కంపు పానీయం ఎంత చేదుగా మార్చగలదో! చదువు, సంస్కారం, సంపాదన, సౌందర్యం ఉన్న వీళ్ళంతా మూడు నాలుగేళ్ళ నుంచి వరాన్వేషణ చేస్తున్నా, ఆపాటి చిన్న సుగుణం ఉన్న వరుడు దొరకక ఇంకా అవివాహితులుగానే ఉన్నారు.

ఎమ్.బి.ఏ. యువకులు ఏమంటారంటే "తాగడం మానడమా! నోనో, మా వృత్తిలో తాగకపోతే సాంఘిక సంబంధాలు ఎలా వృద్ధి చెందుతాయి? మేం బిజినెస్ ఎలా ప్రమోట్ చెయ్యగలం? ఛీ, ఛీ, తాగకపోతే మమ్మల్ని అనాగరికులు అనుకోరూ?" అని తాగడం మానండి అన్న సలహాని, ఇలా వివరణిచ్చేస్తూ చీదిపారేస్తారు. 'మా లైఫ్ పార్టనర్స్‌కి కూడా సోషల్ డ్రింకింగ్ ఉండడం మాకు సంతోషమే" అంటూ ఆహ్వానగీతం కూడా పాడతారు. ఒక్కసారి ఓ సోషల్ డ్రింకర్ అమ్మ–నాన్నల గృహాన్ని ఊహించుకున్నామనుకోండి," మేం నాగరికులమే మాకూ సోషల్ డ్రింకు పొయ్యండి" అని అందమైన బుల్లి బుల్లి గాజు గ్లాసులు పుచ్చుకుని బుజ్జి పిల్లలు తయారయే దృశ్యాలు కనిపించవూ! కుటుంబాలు పార్టీలు చేసుకుంటూ చిన్న, పెద్ద, ఆడ, మగ, పిల్ల, వృద్ధ అందరూ తాగుతూ, తూగుతూ తేలిపోయే దృశ్యాలు కనిపించవూ! – ఇదే సోషల్ డ్రింకింగ్ తరువాతి అడుగు. 'నాకూ కావాలి' అని చిన్నారి గ్లాసు ముందుకు తెస్తే, ఈ సోషల్ డ్రింకింగ్ అమ్మ–నాన్నలు ఏం సమాధానం చెప్పగలరు? వీళ్ళంతా "తాగితే మాకు పెళ్ళిళ్ళవవన్న భయం మాకేం లేదు" అంటున్నారు, వాళ్ళ ధైర్య సాహసాలకి వాళ్ళే గర్వపడి పోతూ. ఎమ్.బి.ఎ. చదువు చదువులో భాగంగా, తాగడం బిజినెస్ సంస్కృతిలో ముఖ్యమైన భాగం అన్నట్టు నూరిపోస్తాయట. ఏ సినిమా చూసినా తాగని హీరో కనిపించడు. ఈ విద్యాధిక యువకులు తాగుడనే చిన్న పనిచేస్తూ హీరోలయిపోతున్నారు. ఇంత గొప్ప హీరోలనీ మన సిసలైన హీరోయిన్లు పెళ్ళాడమంటున్నారు. ఈ సిసలైన హీరోయిన్లు ఏ ఉద్యమం చెయ్యాలి? ట్వీట్ చేస్తారా, ఫేస్‌బుక్‌లో లైక్ చేస్తారా తమ మద్యపాన వ్యతిరేకతని? ఉద్యమం అంటే,

"మేం తాగే వాళ్ళని పెళ్లాడం" అని నినాదాలిచ్చుకుంటూ – రోడ్లంట ఎండల్లో తిరిగి, లాఠీ దెబ్బలు తిననవసరం లేదు,సోషల్ మీడియాలు కూడా ఉద్యమాలు నడిపేస్తా యంటున్నారు ఈ మధ్య కొందరు. ఈ ఉద్యమానికి స్పందన ఎలా ఉండొచ్చునంటే, ఇప్పుడు 'తాగుతావా?' అంటే 'తాగుతా'నని నిజం చెప్పేవాడల్లా "చచ్చినా తాగుడు మాననని" మనసులో శపథం చేసుకుని, అమ్మాయితో "అలవాటే లేదని" ఒట్టేసి చెప్పొచ్చు. కొంతమంది నిజంగానే మారవచ్చు. ఈ రవంత మార్పు కొండంత మోసాలతో ఉ ద్యమం నీరసంగా సాగుతూ ఉంటుంది, ఏమవనీండి, తాగుడుని హీరోయిజంగా చూపించే సినిమాలకి, తాగుడుకి సంస్కృతిలో స్థానం ఇచ్చిన బిజినెస్ చదువులకీ శతృశిబిరంలో ఈ ఉద్యమం బైఠాయించి తన ఉనికిని చాటుకోవచ్చు.

'సోషల్ డ్రింకింగ్' మేమే చేస్తున్నామా. ఆడపిల్లలేం తక్కువగా లేరు ఈ విషయంలో' అంటారు. మన తాగుడు – తూగుడు – పేలుడు సినిమా బయటి హీరోలు, ఆడపిల్లలు కూడా తాగడం వల్ల తాగుడు తప్పుకాకపోతుందనో, తాగుడు వల్ల కలిగేప్రమాదాలు శు భాలయి కూర్చుంటాయనో వాళ్ళ నిబ్బరం! ఆడ పిల్లలు కూడా తాగడం మొదలెట్టిరండి, సమస్య రూపంలోనూ, పరిమాణం లోనూ పెరుగుతోందనీ, ఈ 'తాగే' ద్రవం భూమ్మీద లేకుండా చేసే పట్టుదల పెరగాలని అర్థం కాని, ఆడ మగ పిల్లలు చేసే తప్పుదు సమర్ధన కాదు.

ఆడవాళ్ళు తాగితే, ఆ ప్రభావం కడుపులో బిడ్డ ఎదుగుదల మీద ఉంటుంది. బిడ్డ అవకరాలతో పుట్టవచ్చు. మగవాళ్ళు తాగితే, వంధ్యత్వం, నపుంసకత్వం రావచ్చు. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లలో, డాక్టర్లలో తాగుడు అలవాటు ఎక్కువగా ఉందని వార్తలు వస్తున్నాయి. సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లలో సంతాన సాఫల్యం కూడా తక్కువగా ఉందన్న వార్తలూ వస్తున్నాయి. తాగుడు కూడా దానికి ఒక కారణం. తల్లితండ్రుల్లో ఒకరికి కాని, ఇద్దరికీ కాని తాగుడు అలవాటు ఉంటే, పిల్లలు అభద్రతాభావంతో పెరుగుతారని, లక్ష్య సాధనలో వెనకబడి ఉంటారని ఆధారాలతో చూపిస్తున్నాయి అధ్యయనాలు. సంసారం కమ్మని యుగళగీతంలా సాగిపోవడానికి తగిన చదువు, సంస్కారం, సంపద ఉన్న సున్నిత మనస్కులు అయిన యువతులు, సరసాల సరాగాలతో గుబాళించవలసిన గృహాన్ని ఎక్కిళ్ళ శబ్దాలతో నింపకూడదని, సన్నజాజి పువ్వుల్లా సంపంగి నవ్వుల్లా ముద్దు ముద్దు మాటతో గృహాల్ని నింపే పిల్లలు లేకుండా ఇంట్లో శ్మశాన నిశ్శబ్దం ఆవరించకూడదని, "మేం సోషల్ డ్రింకర్స్‌ని, రెగ్యులర్ డ్రింకర్స్‌ని పెళ్ళి చేసుకోం, అసలు డ్రింకర్స్‌ని పెళ్ళి చేసుకోం" అని తెగేసి చెబుతున్నారు. వీళ్ళ నిశ్చయం అభినందనీయం, కాని వీళ్ళది ఉద్యమస్థాయి అని చెప్పలేం. స్థాయి ఏదయినా 'సోషల్ డ్రింకింగ్' అన్న మహమ్మారి పాత కష్టాలకి అదనంగా చేరిన ఓ అంశం. ఓ చూపు చూడవలసిన అంశం.

మద్యపానం వల్ల నష్టాలు వేరే చెప్పాలా? దూబగుంట ఉద్యమం ఎప్పుడో ఎలుగెత్తి చాటింది వాళ్ళ కష్టాల్ని. నేటి ఆధునిక, విద్యాధిక మహిళలూ చెప్పేరు ఆధునిక కష్టాల్ని రోడ్డు ప్రమాదాలు, స్త్రీలపై అత్యాచారాలు.. ఇంకా ఎన్నెన్నో... ఈ లిస్టు అనంతంగా సాగిపోతుందేమో!

కాకినాడలో నైట్ హోటల్ వీధిలో జనావాసాల మధ్య "బార్" తెరిచారు. ప్రతి ఇంట్లో ఇద్దరేసి చదువుకునే ఆడపిల్లలు, ఉద్యోగాలు చేసుకునే ఆడవాళ్ళు రాత్రి 9-10 వరకు వీళ్ళు అవసరార్ధం తిరిగే సమయంలో ఈ బార్‌లోని యువకుల వల్ల ఇబ్బందులు పడ్డారు. మహిళలు జనం మధ్యలో బార్ ఉండడానికి వీల్లేదని కోర్టుకెళ్లారు. కోర్టు బార్‌ని అక్కడ నుండి తీసేయాలని ఆర్డరిచ్చింది. అలా మొదలయింది చిన్న ఉద్యమం, ఉద్యమం మొదలెట్టిన దగ్గరే ఉంది. బార్‌ని మూసేయలేదు. బార్ వీధి మలుపు దగ్గరికి మారింది. ఇంకా విస్తరించి ఓపెన్ బార్‌గా అవతరించింది. నిరసించే కంఠాలున్నాయి, వాటికి శక్తీ తక్కువగా ఉంది. - ఇదీ ఉద్యమ పరిస్థితి, జనావాసాల మధ్య ఏ నిబంధనలనీ లెఖ్ఖ చెయ్యక వెలిగిపోతున్న మద్యం విస్తృతీ. ఎంతో సంక్షోభాన్ని సృష్టిస్తున్నాయి ఈ నష్టాలు. ప్రజల సంక్షేమ - పథకాల కోసం రెవెన్యూ అవసరం కాదా, అంటాయి ప్రభుత్వాలు 'మద్య నిషేధం' మాట ఎత్తితే. సంక్షోభంలోంచి పుట్టిన రెవెన్యూ - సంక్షేమాన్నందిస్తుందనడం హాస్యాస్పదం కాదూ!

**'మతం మత్తు మందు'** అంటారు సమాజగతి పట్ల ముందు చూపు ఉన్నవాళ్ళు. మత్తుమందు అంటే ప్రజా చైతన్యాన్ని సాగర గర్భంలోకి ముంచేసేదని వాళ్ళ ఉద్దేశం. మద్యం రసాయనికంగానూ మత్తుమందే - ప్రజా చైతన్యాన్ని ముద్ద చేసేదే. ఈ పాలకులకి అసలు కావలసింది రెవెన్యూ కాదు. అంతకన్నఎక్కువగా వారికి కావలసింది ప్రజాచైతన్య వినాశనం. అందుకే మద్య నిషేధంపై వారికంత అలసత్వం. ప్రజా చైతన్యం ఒక్క మద్యపానాన్నే కాదు, సకల సమస్యల్నీ ప్రశ్నిస్తుంది. అందుకే పాలకులకి 'మద్య నిషేధం' మీద అంత అలసత్వం.



**"నూటికి తొంభైమంది దరిద్రుల్ని నిత్యం ఏదోక మత్తులో ఉంచడం ఆ మిగిలిన 10 శాతం ధనికుల అస్తిత్వానికి, ఆధిపత్యానికి అత్యంతవసరం. అందులో భాగమే ఈ మద్యం వ్యాపారం."**

# 6. మద్య నిషేధం, ఒక చర్చ

– దేవి, సాంస్కృతిక కార్యకర్త, హైద్రాబాద్,
సెల్ : 9848622829

భారీ ఎత్తున ఉప్పెనలా రాష్ట్రాన్ని కదిలించిన మద్యం వ్యతిరేక ఉద్యమం మళ్ళీ రావాలని సామాన్య మహిళల కోరిక. తద్వారా కుటుంబ ఆదాయం ఆహారానికి, ఆరోగ్యానికి, పిల్లల చదువుకు అక్కరకు వస్తుందని వారి ఆశ. పైగా తాగుడు తగ్గితే గృహహింస, అత్యాచారాలు తగ్గుతాయి. (అంటే తాగనివారు హింసకూ అత్యాచారాలకూ పాల్పడరని కాదు) అయితే మొదట మనం కొన్ని విషయాలు ఆమోదించాలి.

సారా, సుర, సోమం, కల్లు ఇతర భంగు, గంజాయి వంటి మాదక ద్రవ్యాల వాడకం ప్రాచీన కాలం నుండి ఉంది. వేడుకల్లోనూ దుఃఖాల్లోనూ సామూహికంగా "మత్తు" తీసుకునే ఆచారాలూ ఉన్నాయి. సురాపానం చేసే దేవతలు దేవుళ్ళు లెక్కకు మిక్కిలిగా ఉన్నారు. అయితే మెదడును నిస్తేజ పరిచే "మత్తు" మనిషిని అధఃపాతాళానికి తొక్కుతుందనే హెచ్చరికలూ సమాంతరంగా కొనసాగుతూ వచ్చాయి. మద్యం ఆరోగ్యానికి హానికరం అనేది రకరకాలుగా నిరూపితం అవుతూనే వుంది..

మద్యం తాగడం తాగక పోవడం ఒక వ్యక్తిగత విషయం అనీ నిషేదం అంటే వ్యక్తి స్వేచ్ఛను అరికట్టడమేనని వాదించే అత్యాధునికులూ ఉన్నారు. కాదు మద్యం అనేది ఒకనైతిక సమస్య అనీ తాగితే నైతిక పతనమని మడికట్టుకుని మరీ వాదించే వారికీ కొరత లేదు. సారా అనేది ఒక అలగా జనపు అలవాటనీ ఛీత్కరించే అగ్రహారికులున్నారు. అసలు ఈ లిక్కరు వ్యసనమంతా మ్లేచ్ఛుల వల్లనే వచ్చింది మనం స్వచ్ఛం అనుకునే అమాయక ఛాందసులకూ కొదవలేదు.

అయితే ప్రపంచ వ్యాప్తంగా రకరకాల మద్యాలు, అనేకరకాల సేవనపు అలవాట్లు ఉన్నాయి. అనేక దేశాల్లో 18 సం॥రాల లోపు బాలలకు మద్యం నిషేధం. తరువాత లేదు. అయితే అన్ని వయస్సుల వారికీ మాదక ద్రవ్యాల సేవనం నిషేధం. అది అతి పెద్ద నేరం. దానికి తీవ్రాతితీవ్ర శిక్షలూ ఉన్నాయి.

మన దేశంలో విప్పసారా లేదా కాపుసారాకాయటం కొన్ని జన సమూహాల సాంప్రదాయిక ఆచారం. స్త్రీ పురుషులంతా వేడుకలో విషాదంలో కలిసే సేవిస్తారు. అది తప్పుకాదు. ఒళ్ళు విరిగే కష్టం చేశాక త్రాగకపోతే విశ్రాంతి ఉండదని కొందరు తాగుడుకు అలవాటుపడిన శ్రామికులు వాదిస్తారు. శవాలు కాల్చడం, చచ్చిన పశువుల చర్మం వలచడం, మలమూత్రాలు ఎత్తిపోయడం, మురుగు కాల్వలు శుభ్రం చేయటం వంటి అమానుష వృత్తుల్లోవారు తాగందేపని జరగదంటారు.

శ్రామికుల కష్టాన్ని దోచుకొనటంతో ఆగకుండా వారికి అవసరం అయిన ఆహారాన్ని విశ్రాంతిని ఇచ్చే వేతనం యివ్వకపోవడం వలన వారు తాత్కాలికంగా శక్తిని నరాలను ఉద్రేక పరిచే నిషాతో పొందుతారు. అది అలవాటుగామారి క్రమంగా అది వారిని కబళిస్తుంది. అమానవీయమైన పనుల్లో అణిచివేయబడిన వారికి ఓదార్పు ముఖ్యమే. ఎందుకంటే అటువంటి పనులు చేయడానికి "శుచి" గల వారు సిద్ధపడరు – కాబట్టి మద్యం అనేది కేవలం ఆదాయ దోపిడీకే కాదు – శ్రమ దోపిడీకి, అమానుష పీడనకూ కూడా ఒక సాధనం. అటువంటి వృత్తుల్ని రూపు మాపకుండా నీతి బోధనలు నిరుపయోగం.

మద్యం ఒక నైతిక విషయం కాదు. అది ఆరోగ్య సమస్య, సామాజిక సమస్య, ఆర్థిక సమస్య, ఒక రాజకీయ వ్యూహం. ఇది వ్యక్తిగత విషయం, మహిళల సమస్య కాదు. కుటుంబ సమస్య.

మద్య వ్యతిరేక ప్రచారం ఒక ఆత్మనిగ్రహానికి సంబంధించిన వ్యవహారంగా చేరడం అంటే కొన్ని తరగతుల వారికి నైతిక ఆధిపత్యం కట్టబెట్టడమే. కొన్నిరకాల జీవన శైలులను అందరిపైనా రుద్దడమే. మద్యాన్ని వ్యతిరేకిస్తున్నవారు ఎక్కువగా చేస్తున్న పొరపాటు యిదే. ఇది ప్రభుత్వం నెత్తిన పాలు పోసినట్టే. మద్య వ్యతిరేకతను కూడగట్టే ప్రయత్నాలకు పురిట్లో సంధి కొట్టినట్టే.

ఇది ప్రధానంగా ఒకరాజకీయ ఆర్థిక సమస్య. ప్రభుత్వ ఆదాయంలో 25–30% మద్యం వలన లభిస్తున్నది. ఈ ఆదాయం లేకపోతే సంక్షేమ పథకాలు నడపలేమని ప్రకటిస్తున్నది ప్రభుత్వం. లభిస్తున్న ఆదాయంలోకేవలం 8 శాతం మూలమే అన్ని రకాల సంక్షేమాలకూ కలిపి ప్రభుత్వం ఖర్చు చేస్తున్నది. ఎంత అబద్ధపు సమర్థింపు.. సంపన్నులపై ప్రత్యక్ష పన్నులు విధించకుండా కార్పొరేటు కంపెనీలకు లక్షల కోట్ల రాయితీలు పైసాకు అరపైసాకు రేటున వారికి సహజ వనరులను తెగనమ్ముకుంటున్న ప్రభుత్వాలు ఇపుడు మద్యం జబ్బుతో ఖర్చు వెళ్ళ దీసుకుంటున్నవి.

అలవి కాని వాగ్దానాలు చేసి గద్దెలనెక్కిన తర్వాత ప్రజలను మరపించడానికి ఒకసాధనం మద్యం. మరో సాధనం మతం కులం.. వీటిపైనే అయిదేళ్ళు గడిపి తిరిగి అధికారంలోకి రావాలంటే మద్యం కంటే మరో రాజమార్గం లేదు. ఒక ప్రక్కన విసిగి వేసారిన మహిళలకు మద్య నియంత్రణ, దశలవారీ నిషేధం వంటి వాగ్దానాలు చేస్తూనే మరోవైపు మగవాళ్ళను మద్యంలో ముంచి తేల్చవచ్చు. ప్రతి ఎన్నికల్లో 10 శాతం మంది కొత్తగా తాగుబోతులవుతారు.. మద్యం కాంట్రాక్టర్లు నిధులే కాదు మద్యం కూడా

ప్రవహింపచేస్తారు రాజకీయ పార్టీలకు – కాని ప్రతి రాజకీయపార్టీ మద్యంపై నైతిక యుద్ధం ప్రకటిస్తూనే వుంటుంది.

మరోవైపున దారిద్ర్యానికి కారణం తాగుడు అని అది ఒక వ్యక్తిగత చెడు అలవాటనీ మంచివారు తాగరని ప్రచారం సాగుతుంటుంది. మద్యం నిషేధ కాలం నుండి మొదలుపెట్టి మన రాష్ట్రంలోను డ్రై పిరియడ్‌గా చెప్పుకునే కాలంతో పాశ్చాత్య దేశాల్లోను, యిప్పటికీ జరుగుతున్న ప్రతి అధ్యయనంలోనూ ఒక్క విషయం స్పష్టంగా తేలింది. "మద్యం" అందుబాటులో వుంటే తాగుడు పెరుగుతుంది. అందుబాటులో లేకుండా తాగే అలవాటుక్రమంగా తప్పిపోతుంది. పిల్లలు అస్సలు అలవాటుకు లోనుకాకుండా ఉంటారు. 15 ఏళ్ళలోపు పిల్లలు భారీసంఖ్యలో మత్తుకు బానిసలవుతున్నారంటే తెలుగు రాష్ట్రాలు ప్రమాదం అంచున ఉన్నట్టే. దేశవ్యాప్తంగా అధిక శాతం మగవాళ్ళు తాగుడుకు బానిసలయితే తెలుగు రాష్ట్రాల్లో ఇది 48 శాతానికి చేరింది. 15 శాతంపైగా మైనర్లు వివిధ రకాల మత్తులకు అలవాటయ్యారు.

"సంపూర్ణ మద్య నిషేధం సాధ్యం కాదు. ఎందుకంటే కల్తీ, అక్రమ రవాణా వల్ల తాగేవారికి మద్యం లభిస్తుంది. కాని ప్రభుత్వం ఆదాయం కోల్పోతుంది. గుడుంబా వద్దు గంజాయివద్దు కాని బీరు లిక్కరు చట్టబద్ధంగా తాగండి" అంటున్నాయి ప్రభుత్వాలు. అయితే మహిళల, బాలల అక్రమ రవాణా ప్రపంచంలో ఆయుధ రవాణా తర్వాత అతిపెద్ద ఆదాయ వనరు. మరి దాన్ని అరికట్టలేకపోతున్నారు కాబట్టి ఆ అక్రమ రవాణా ద్వారా కూడా ప్రభుత్వం ఆదాయం పొందవచ్చు కదా? అసలు ప్రభుత్వ ఆదాయ వనరు లేంటి వాటిని దేని కొరకు వాడుతున్నారో ఆ సమాచారాన్ని ప్రజల దాకా ప్రభుత్వాలు చేరనిస్తున్నాయా?

రకరకాల కుంభకోణాల్లో యిప్పటిదాకా కోల్పోయిన ఆదాయం ఎంతో లెక్కుందా? బ్లాక్‌మనీ వివరాలు లోతు అందిందా? కార్పొరేట్లకు పన్ను రాయితీగా గత 5 ఏళ్ళుగా 15 లక్షల కోట్లు మినహాయింపు యిచ్చిన సొమ్ము మాటేంటి? ఆదాయం పన్ను, ప్రత్యక్ష పన్నులు సక్రమంగా వసూలు చేస్తే వచ్చే ఆదాయం ఎంత? ప్రజల ఉమ్మడి భూములు ప్రభుత్వరంగ సంస్థలు సహజ వనరులు కార్పొరేట్లకు అప్పగించడం ద్వారా కోల్పోయిన ఆదాయం ఎంత?

మద్యం వలన జరిగే నేరాలు, హింస అరికట్టడానికి ప్రభుత్వం పెట్టే ఖర్చు మాటేమిటి? రోడ్డు ప్రమాదాల్లో సగం మద్యం వల్లనే కదా.. డ్రంకెన్ డ్రైవ్ టెస్ట్‌లు ఇతర ట్రాఫిక్ యాక్సిడెంట్ నివారణకు పెట్టే ఖర్చు సంగతేంటి? తాగి పనికి వెళ్ళనందువల్ల కోల్పోతున్న పని దినాలు తగ్గుతున్న ఉత్పత్తి కథ ఏమిటి? తాగుడుతో తెచ్చుకునే జబ్బుల

చికిత్సకు జరిగే ఖర్చు, అకాల మరణాల వలన కోల్పోతున్న వుత్పత్తిశక్తి.. తద్వారా లభించే ఆదాయం లెక్కలు పరిగణనలోకి రావా? తాగుడు వల్ల మత్తుకు బానిసయిన ప్రజ ఎంత దుర్మార్గ రాజకీయానికి అవకాశం యిస్తుంది? నల్లమందుకు అలవాటు చేసి చైనాను లొంగదీసుకున్న కథ ఎవరికయినా గుర్తుందా?

కాబట్టి ఆదాయం కోల్పోవడం గురించి మాట్లాడే అర్హత ప్రభుత్వాలకు లేదు. కల్తీని అక్రమ రవాణాని అరికట్టలేని చేతకాని ప్రభుత్వాలు దానిని సాకుగా చూపడం నేరం. అసలు అరికట్టే వుద్దేశ్యం వారికి లేదనేది అసలు రహస్యం.

అసలు మద్యాన్ని ఒక ఆదాయ వనరుగా చూసి తాగుడు ప్రోత్సహించే విధానం సరైనదేనా? దీనిని అనుమతించవచ్చా. ఇది ప్రజాస్వామ్యాన్ని పరిహసించడం కాదా?

ఏ రకం అయిన మద్యం అనుకూల వాదనలయినా తొలగించలేవు. మరెందుకు ప్రభుత్వాలను లొంగదీయలేక పోతున్నాం?

1992లో సారా వ్యతిరేక ఉద్యమం రావడానికి భూమిక సిద్ధం చేసింది అక్షరాస్యతా ఉద్యమం. గుంపులుగా చేరి అక్షరాలు నేర్వడంలో జతపడిన అట్టడుగు స్థాయి మహిళలు సామూహికంగా తిరగబడ్డారు. వారినాపడం ఎవరితరం కాలేదు. వారిని దారి మళ్ళించి అప్పులు వడ్డీ లెక్కల ద్వారా జీవితాలు బాగుపడతాయనే భ్రమ కల్పించారు. ఇపుడా గుంపులు ప్రభుత్వాలు విదిల్చే రాయితీల కోసం ఎదురుచూస్తూ బుద్ధిగా పాత అప్పులు చెల్లించుకుంటున్నాయి. అపుడపుడూ ఏలిన వారి సభలకు సమీకరణలకి పనికి వస్తున్నాయి. ఆనాడు తెగగొట్టిన మహిళా సంఘాలు వాటి సభ్యత్వం కొనసాగుతున్నా ఈ తెల్ల ఏనుగుని లేపే స్థితిలో లేవు. “సారా” వుద్యమం “మాదే”నని ఆర్భాటం చేసిన స్వచ్ఛంద సంస్థలకు ఏనాడూ పునాది లేదు. అవి ఆ ప్రచారంలో అనేక ప్రాజెక్టులు పొంది సొమ్ము చేసుకుంటున్నాయి. ఆనాడు ఉద్యమానికి వెన్నెముకగా నిల్చిన వామపక్షం బలహీనపడింది. ఇతర రాజకీయ పార్టీలు “మద్యంమంట” రేగితే చలి కాచుకోవడానికి ఇప్పటికీ సిద్ధంగానే ఉన్నారు. వారంతట వారుగా పనిచేసే ఆచారం వారికి ఎన్నడూ లేదు.

అయితే ఈ మధ్య కాలంలో కేరళలో దశలవారీ నిషేధం, బీహార్‌లోపూర్తి నిషేధం విధించారు. తమిళనాడు అంచెలంచెలుగా చేస్తానని అంటున్నది. ఇదంతా ప్రజల నుండి ఎదురవుతున్న అసంతృప్తిని శాంత పరచడానికి జరుగుతున్న ప్రయత్నమే.

ఒకవైపున నిత్యావసర వస్తువుల ధరలు చుక్కలు చూడటం పేదల కనీస ఆదాయం పెరగక పోవటంతో తగ్గించాల్సిన ఖర్చు “మద్యం” అవుతుంది.. 1992లో కూడా యిదే పరిస్థితి ఏర్పడింది. కనుక మళ్ళీ ఒక బలమయిన ఆకాంక్ష వ్యక్తం అయ్యే అవకాశం ఉంది.

అదే జరిగితే... ఒకేసారి కాకుండా..

దశలవారీగా నియంత్రణ జరగాలి.

ముందుగా విస్తృత ప్రచారం చేసి ప్రజల సహకారం కోరాలి. మొత్తం ప్రభుత్వ యంత్రాంగం, స్వచ్ఛంద సంస్థలు, ప్రసార సాధనాలు కలసి పనిచేయాలి. దానిలో మహిళలూ, ప్రజాసంఘాలు, చైతన్యవంతులు ప్రధాన పాత్ర పోషించాలి. స్థానికంగా నియంత్రణా కమిటీలు వేసి వాటిలో మహిళల సంఖ్య అధికంగా ఉండేలా చూడాలి. దీనికి చట్టబద్ధత, భద్రత కల్పించాలి.

యిటువంటి అనేక అంశాలను అనుభవాల ప్రాతిపదికన చర్చించి డిమాండ్లుగా చేర్చుకోవాలి. లేకుంటే పాత కథే పునరావృతం అవుతుంది.

అయితే గత మద్య వ్యతిరేక ఉద్యమకాలానికినేటికీ అనేక మార్పులు జరిగాయి. ఈ మార్పులు ఆలోచనలో, జీవన విధానంలో జరిగాయి. సాంకేతికత సమాచార విస్ఫోటనంతో ప్రభుత్వ ప్రచార శక్తి అపరిమితంగా పెరిగింది. ప్రజలశక్తి పట్ల ప్రత్యేకించి మహిళా ఉద్యమాల పట్ల ప్రతికూలత కొన్ని తరగతులలో బహిరంగంగానే ప్రకటితం అవుతున్నది. మారిన జీవన విధానం పెరిగిన అంతరాల అగాధాలు యువతలో ఒక నిస్పృహను రేకెత్తిస్తున్నాయి. వీటన్నింటినీ పరిగణనలోకి తీసుకోవల్సి ఉంటుంది.

అయితే అద్భుతమయిన మానవ మస్తిష్కాన్ని నిర్వీర్యం చేసే "మత్తు"ను, వికాసాన్ని నాగరికతనూ ప్రజాస్వామ్యాన్ని కోరుకునే ఏ మానవీయ సమాజం కొనసాగించరాదు. అవి కొనసాగితే భవిష్యత్తును కోల్పోయే ప్రమాదం వుంది. అట్లాగే ఎంత సాంకేతిక విస్ఫోటనం జరిగినా అది మానవుల ఉమ్మడి ఆకాంక్షలను చెరపలేదు. వారి సామూహిక శక్తిని అడ్డలేదు. సాంకేతికత చైతన్యానికి ప్రత్యామ్నాయం కాదు. కాబట్టి "మత్తు" వ్యతిరేక ఉద్యమం మళ్ళీ అంచనాలు తారుమారు చేయాలని ఆశిద్దాం.

**"సాంఘిక బహిష్కరణకి గురి కావలసిన మద్యపానం సామాజిక హెూదాకి చిహ్నంగా చూడబడటం ప్రస్తుత మన అధ్వాన్న స్థితికి నిదర్శనం."**

# 7. మద్యపానం- దుష్ప్రభావాలు

– సి. హెచ్. ప్రమీల, రాష్ట్ర కార్యదర్శి, అఖిల భారత మహిళా సాంస్కృతిక సంఘం,
హైద్రాబాద్, సెల్ : 9440350827

మనదేశంలోని అన్ని రాష్ట్రాల్లోనూ మద్యపానమనేది నేడు ఒక పెనుప్రమాదంగా తయారైంది. మద్యపాన వ్యసనానికి బలైన వారి సంఖ్య నానాటికి పెరుగుతోంది. మనదేశం ప్రపంచంలోని అతి పెద్ద మద్యపాన సేవకులున్న దేశాల్లో ఒకటిగా చేరిపోయింది. మద్యపానం మెదడుపై ప్రభావాన్ని చూపి ఆలోచనా ప్రక్రియను హేతుబద్ధతను దెబ్బ తీసి, సామాజిక ప్రవర్తనను ప్రభావితం చేస్తుంది. మద్యపానానికి బానిసలైన పురుషులవలన వారి కుటుంబాలపైన, సమాజంపైన తీవ్రమైన చెడు ప్రభావం పడుతుంది.

## పెచ్చుపెరుగుతున్న మద్యం ప్రమాదం:

భారతదేశంలో మద్యపానానికి సంబంధించి సరైన రికార్డులు లేవు. 1970 నుండి 1996 వరకూ తాగుడు 106.7% పెరిగిందని సర్వేలు చెబుతున్నాయి. మనకి అందుబాటులో ఉన్న డేటా ప్రకారం 62.5 మిలియన్ల మంది తాగుబోతులుంటే అందులో 14 మిలియన్ల మంది తీవ్రమైన వ్యసనానికి గురై వైద్య చికిత్స అవసరమై ఉన్నారు. దాదాపు 50% మంది తాగుబోతులు, అనుమతించబడిన మోతాదుకంటే ఎక్కువగా త్రాగుతూ తీవ్రమైన ఆరోగ్య సమస్యల్ని ఎదుర్కొంటున్నారు. మొత్తం తాగుబోతులలో 80% మంది అత్యంత గాఢత కలిగిన ఆల్కహాలును తాగుతున్నారు. మనదేశంలో తాగుతున్న ఆల్కహాలులో మూడింట రెండొంతులు ఇల్లిసిట్ ఆల్కహాలే. కాబట్టి దీనికి అసలు రికార్డులే ఉండవు. ఇండియన్ మేడ్ ఫారిన్ లిక్కర్‌ని తాగుతున్నవారి సంఖ్య ఏడాదికి 15% పెరుగుతోంది. మద్యం తాగుతున్న వారిలో ఆయుక్షీణత గత రెండు దశాబ్దాల కాలంలో 19 ఏళ్ల నుండి 13సం॥రాలు పడిపోయింది.

## మద్యపానం – గృహహింస:

మనదేశంలో మహిళలమీద గృహహింస పెరుగుతూ ఉంది. తాగుబోతులులేని ఇళ్లల్లో కంటే తాగుబోతులు ఉన్న ఇళ్లల్లోనే గృహహింస ఆరురెట్లు ఎక్కువగా ఉన్నట్లు ఒక సర్వే ప్రకారం తెలుస్తోంది. ఇటువంటి గృహహింసకి గురైన మహిళలు, అత్యంత కుంగుబాటుకు, ఆందోళనకు గురై కొన్నిసార్లు వారు కూడా తాగుడు అలవాటుకు బలవుతున్నారు. చిన్నాభిన్నమైన ఆర్థికపరిస్థితిలో కొన్నిసార్లు మహిళలు వ్యభిచారంలోకి నెట్టివేయబడుతున్నారు. మరికొన్ని సార్లు ఆత్మహత్యలకు పాల్పడుతున్నారు.

## పిల్లలపై ప్రభావం- పెరుగుతున్న నేరాలు:

మద్యం తాగే వారున్న కుటుంబంలోని పిల్లలు కూడా మహిళల్లాగే హింసకు గురౌతారు. తాగుబోతుల పిల్లల ప్రవర్తన సంబంధమైన అవలక్షణాలకు గురౌతున్నట్లు

వెళ్ళడైంది. అబద్ధాలాడటం, దొంగతనాలకు పాల్పడటం, గొడవలకు దిగటం, కోపోద్రిక్తులవటం లాంటి అనేకమైన అవలక్షణాలకు గురై క్రమంగా అసాంఘిక కార్యకలాపాల్లో పాల్గొనడం జరుగుతుంది.

**ఆరోగ్యంపై ప్రభావం:**

కర్ణాటక రాష్ట్రంలో నిర్వహించిన ఒక స్టడీ ప్రకారం మద్యం అమ్మకాల ద్వారా వచ్చిన ఆదాయంలో 300% వరకు తాగుడువలన కలిగే రుగ్మతల చికిత్సకు ఖర్చవుతుంది. 15-20 శాతం బ్రెయిన్ సంబంధ గాయాలకు కారణం తాగుడే కారణం. సైకియాట్రిక్ సమస్యల్లో 17.6%; ఆత్మహత్య ప్రయత్నాలకి 34% కారణం తాగుడే. లివర్ సిరోసిస్ వ్యాధికి ప్రధానంగా త్రాగుడే కారణం.

**పేదరికం - సంబంధిత నేరాలు:**

గ్రామీణ మరియు పట్టణ ప్రాంత సాధారణ కార్మికుల యొక్క ఆదాయంలో అధికభాగం తాగుడుకు ఖర్చుపెడుతున్నారు. తక్కువ ఆదాయం గల వర్గాల్లో ఒక అంచనా ప్రకారం వారి ఆదాయంలో దాదాపు 45% తాగుడుకి ఖర్చు పెడుతున్నారు. తాగుడు వ్యసనానికి బానిసైన వారు డబ్బు కొరకు ఎటువంటి నీచానికైనా దిగజారుతారు.

**సమస్యకి మూల కారణం:**

రాజ్యాంగంలోని 47వ ప్రకరణ ఆదేశిక సూత్రాల ప్రకారం మత్తు కలిగించే పానీయాలు కానీ; మాదకద్రవ్యాలు కాని ఆరోగ్యపరంగా డాక్టరు సిఫార్సు మేరకు తప్ప అందుబాటులో ఉండకూడదని నిర్దేశించినప్పటికీ మన కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు మద్యం, మాదక ద్రవ్యాలను విచ్చలవిడిగా వ్యాపింపజేస్తున్నాయి. అనేక రాష్ట్రాల్లో ముఖ్యంగా రెండు తెలుగు రాష్ట్రాల్లో ప్రభుత్వాలు మద్యం అమ్మకాల ద్వారా అత్యధిక రెవెన్యూని సంపాదించాలనుకుంటున్నాయి. మద్యం లాబీలకు, ప్రభుత్వ యంత్రాంగం, పెద్ద రాజకీయ పార్టీల నాయకులకు, పోలీసులకు మధ్య నున్న అండర్‌స్టాండింగ్ వల్ల లిక్కర్ బారెన్స్ ప్రభుత్వ పాలసీలను, నిర్ణయాలను తమకనుకూలంగా మలచుకోగలగుతున్నారు. దేశ, విదేశీ లిక్కర్ బారెన్స్‌కి భారతదేశ మార్కెట్ చాలా ఆకర్షణీయమైంది. ప్రపంచీకరణ విధానాలలో భాగంగా మన ప్రభుత్వాలు విదేశీ లిక్కర్ బారెన్‌లకి అనుకూలంగా అనేక చట్టాలున్నాయి.

మన ప్రచార సాధనాలు ముఖ్యంగా సినిమాలు త్రాగుడుని ప్రోత్సాహించే పాత్రను పోషిస్తున్నాయి. మద్యం ప్రకటనల మీద నిషేధం ఉన్నప్పటికీ పరోక్ష రూపాల్లో ప్రచారాన్ని విస్తృతంగా చేస్తున్నాయి. సీరియల్స్‌లోనూ, సినిమాల్లోనూ తాగుడును సభ్యతకు, సమాజంలో ఒక హొదాకు చిహ్నంగా చూపిస్తున్నారు. టూరిజాన్ని ప్రోత్సహించే పేరుతో ప్రభుత్వాలు

మద్యం షాపులను, బార్లను విపరీతంగా అనుమతిస్తూ ప్రోత్సహిస్తున్నారు. మద్యం విరివిగా అందుబాటులో ఉండటమనేదే తాగుడు వ్యసనం పెరగడానికి అతిపెద్ద కారణంగా ఉందనేది వివిధ గణాంకాలు సూచిస్తున్నాయి.

డిమాండ్లు:

1. వైద్యపరమైన అవసరాలకు తప్ప మద్యం అందుబాటులో లేకుండా కేంద్రప్రభుత్వాల మద్యం విధానాలుండాలి.
2. అక్రమ మద్యం సరఫరాని అరికట్టాలి. చట్టాలు ఖచ్చితంగా అమలు జరిగేలా చర్యలు చేపట్టాలి.
3. ప్రచార, ప్రసార సాధనాల్లో ప్రత్యక్ష, పరోక్ష మద్యం ప్రకటనల్ని అనుమతించరాదు.
4. సినిమాల్లోనూ, టీవి సీరియల్స్‌లోనూ తాగుడుని ప్రోత్సహించే విధంగా ఉన్న దృశ్యాలను సెన్సార్ చేయాలి.
5. మద్యం కంపెనీలు ప్రభుత్వ కార్యక్రమాలను స్పాన్సరు చేయడాన్ని అనుమతించరాదు.
6. మద్యం, మాదక ద్రవ్యాల వలన కలిగే భౌతిక, మానసిక, సామాజిక మరియు ఆరోగ్యపరమైన పరిణామాలను పాఠ్యాంశాలలో పొందుపరచాలి.

**పత్రికా రిపోర్టు ప్రకారం:**

ప్రపంచ ఆరోగ్యసంస్థ, కేంద్ర కుటుంబ సంక్షేమశాఖ నివేదికల ప్రకారం ప్రతి 96 నిమిషాలకు ఒక భారతీయుడు మద్యపాన దురలవాటులో మరణిస్తున్నాడు. భారతదేశంలో జరిగే రోడ్డు ప్రమాదాల్లో సుమారు 70 శాతం ప్రమాదాలు మద్యం సేవించి వాహనాలు నడపడం వల్లనే జరుగుతున్నవి. దేశంలో ఏటా జరుగుతున్న మరణాల్లో 12% మరణాలు అధిక మద్యపానం వలన, సంబంధిత రోగాలవలన సంభవిస్తున్నవే. ప్రపంచ ప్రజల సరాసరి మద్యపాన సేవనం ఏడాదికి 6.2 లీటర్లు అయితే, తెలుగు ప్రజలు ముఖ్యంగా గ్రామీణ ప్రజలు సరాసరి సేవించే మద్యపానం ఏడాదికి తలకు 12 లీటర్లు. సగటున 30% మంది భారతీయులు మద్యం సేవిస్తుంటే అందులో 11% మంది దానికి బానిసలై పోయారు. 1992-2012 మధ్య కాలంలో మద్యపానం చేసే భారతీయుల సంఖ్య 55% పెరిగింది. ముఖ్యంగా ఈ పెరుగుదల యువతలో ఎక్కువగా ఉంది. 2012 నాటికి 3.3 మిలియన్ల భారతీయులు మద్యపానం సంబంధిత రోగాల

వలన చనిపోయారు. భారతదేశంలో నిరుపేదల సంఖ్య పెరగడానికి ఇది కూడా ఒక కారణం.

ఉమ్మడి రాష్ట్రంలో యేటా మద్యం టార్గెటు 10% పెరిగేది. ప్రత్యేక రాష్ట్రాలుగా విడిపోయిన తర్వాత ప్రభుత్వాలు మద్యం అమ్మకాల టార్గెటును ప్రతి సం॥రం 20% పెంచుతూ పోతున్నాయి. 2014-2015 సం॥రానికి తెలంగాణలో మద్యం అమ్మకాలు 10,238.78 కోట్లు అయితే; 2015-2016 సం॥రానికి టార్గెటు: 12,207.78 కోట్లు. అదేదో పోటీ అయినట్లు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం 2015-2016 సం॥రంలో వసూలు చేసిన ఎక్సైజు ఆదాయం 12,739 కోట్లు. కాబట్టే రెండు తెలుగు రాష్ట్రాలు మహిళలపై నేరాలు అత్యాచారాల సంఖ్యలోనూ ముందున్నాయి! ఇది అత్యంత సిగ్గు చేటైన విషయం. భారతదేశం మొత్తం మీద మద్యం ప్రధాన ఆదాయ వనరుగా మిగిలిన రాష్ట్రాలు కేవలం తెలుగు రాష్ట్రాలే కావడం గమనించ దగ్గ విషయం.

గుజరాత్‌లో మద్యపానాన్ని నిషేధించారు. ఈ మధ్యనే బీహార్ సంపూర్ణ మద్యనిషేధం విధించింది. భారతదేశంలో అత్యధిక తాగుబోతులున్న కేరళ రాష్ట్రం 2014 నుంచి ప్రైవేటు బార్లకు లైసెన్సును రద్దు చేసింది. సం॥రానికి 10% చొప్పున్న షాపుల సంఖ్య తగ్గిస్తూ సంపూర్ణ మద్యనిషేధం వైపు పయనిస్తూ ఉంది. నాగాలాండ్, మణిపూర్, లక్షద్వీపులలో కూడా నిషేధం కొనసాగుతోంది. సం॥రానికి 8 నుండి 9 వేల కోట్ల రూపాయల ఆదాయాన్ని కోల్పోతూ కూడా కేరళ నిషేధంవైపు ప్రయనిస్తోంది. అయితే కేరళలో దీన్ని సాధించడానికి (ఏఐఎంఎస్ఎస్) ఆధ్వర్యంలో జస్టిస్ కృష్ణయ్యర్ సారథ్యంలో ప్రజా కమిటిని ఏర్పాటు చేసి, దీర్ఘకాలికంగా సమరశీల ఉద్యమాన్ని నిర్వహించడం జరిగింది. ఫలితంగా ప్రభుత్వాలపై ఉద్యమ వత్తిడి పెరిగి మద్యాన్ని నియంత్రించడానికి చర్యలు చేపట్టడం జరిగింది. అలాగే ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో మహిళలు చారిత్రాత్మక ఉద్యమాన్ని నిర్మించి సారా నిషేధాన్ని, పిమ్మట సంపూర్ణ మద్యనిషేదాన్ని సాధించారు. క్రమంగా పాలకులు దానికి తూట్లు పొడిచి నిర్వీర్యంచేసి అంతిమంగా నిషేధాన్ని ఎత్తివేశారు. ఇటీవల తెలంగాణ ప్రభుత్వంలో కూడా ప్రభుత్వం చీపు లిక్కర్‌ను తీసుకువచ్చి అమ్మకాలను పెంచాలని నిర్ణయించినప్పుడు పెద్ద ఎత్తున నిరసన ఉద్యమం రావడంతో వెనక్కు తగ్గడం జరిగింది. కాబట్టి ప్రభుత్వ వినాశకర మద్యం విధానాలకు వ్యతిరేకంగా మహిళా, యువజన ఉద్యమమొక్కటే పరిష్కారం. ఉద్యమ వత్తిడిలో మాత్రమే నేటి ప్రజా వ్యతిరేక, ప్రభుత్వాల క్రూరమైన పాలనను ఎదుర్కోగలుగుతాం. వివిధ స్థాయిల్లో మహిళా,యువజన సమశీల ప్రజాసంఘాలను ఏర్పాటుచేసి బ్రహ్మాండమైన ప్రజా ఉద్యమానికి పూనుకోవడమొక్కటే మనముందున్న ఏకైక పరిష్కార మార్గం.

# 8. మద్య నిషేధ సాధనే రోశమ్మకు నిజమైన నివాళి

– వి. సంధ్య, ప్రగతిశీల మహిళా సంఘం,
హైద్రాబాద్, సెల్ : 9849018471

దూబగుంట రోశమ్మ.... సంసారాలు నాశనం చేసే మాయదారి మద్యం మా ఊరికి వద్దని కన్నెర్ర చేసిన ఉద్యమ కెరటం, ఆంధ్ర రాష్ట్రంలో మద్యాన్ని నిషేధించాలనే నినాదాన్ని దిక్కులు పిక్కటిల్లేలా వినిపించిన ఉద్యమానికి నాంది పలికిన నాయకురాలు.

రాష్ట్ర వ్యాప్తంగా ఉప్పెనలా విరుచుకుపడిన మహిళల మద్య వ్యతిరేక పోరాటానికి తలవంచక తప్పని పరిస్థితుల్లో 1993 ఏప్రిల్ 15న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మద్యాన్ని నిషేధిస్తున్నట్లు ప్రకటించింది. నెల్లూరు జిల్లాలో నిషేధం వెంటనే అమలులోకి వస్తుందనీ, రాష్ట్రంలోని మిగిలిన జిల్లాల్లో అక్టోబర్ 1 నుండి నిషేధం అమలులోకి వస్తుందని ప్రకటించింది. మద్యం నిషేధించే అభ్యుదయ గాంధేయ సిద్ధాంతాలు తమ పార్టీకి మొదటి నుంచీ వున్నాయనీ ప్రకటించుకున్న ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కరరెడ్డి నిషేధ ప్రకటనకు ముందే 23 బ్రూవరీలు – డిస్టిలరీలకు పర్మిషన్ ఇవ్వడాన్ని ప్రజా ప్రయోజనం కోసమే అని ప్రకటించారు. అంతటితో ఆగకుండా గతంలో లిక్కర్ తయారుచేసే ఫ్యాక్టరీల కోటా పెంచారు. ఐ.యమ్.ఎఫ్.ఎల్. (ఇండియన్ మేడ్ ఫారిన్ లిక్కర్)ను ప్రభుత్వమే పంపిణీ చేస్తుందని కూడా ప్రకటించాడు. ఒక్కమాటలో చెప్పాలంటే మద్య నిషేధ ప్రకటన ప్రజల కంటి తుడుపు చర్య తప్ప మరేమీ కాదు. ఒకవైపు సారాను నిషేధిస్తున్నారని ప్రకటించి మద్యం వలన నష్టపోయిన ఆదాయాన్ని ఐ.యమ్.ఎఫ్.ఎల్ ద్వారా సంపాదించే ప్రయత్నమే తప్ప మరొకటి కాదు. అప్పటి నుండి ఇప్పటి వరకు ఏ ప్రభుత్వం అధికారంలోకి వచ్చినా పేరు మార్చి మరో పేరుతో మద్యం అమ్మకాలు కొనసాగిస్తున్నారు తప్ప తగ్గించుకున్నది కొద్దికాలం మినహా ఎప్పుడూ లేదు.

పాలక పార్టీతో కలిసి ప్రతిపక్ష పార్టీలూ, వామపక్ష పార్టీలు, కొన్ని రాజకీయ పార్టీలు, మీడియా చరిత్రను పాక్షికంగానే చూపించే ప్రయత్నం చేశారు. మద్యం నిషేధ ఉద్యమ పుట్టుక పెరుగుదలను నెల్లూరుకే పరిమితం చేశారు. తెలంగాణ జిల్లాలో జరుగుతున్న భూస్వామ్య వ్యతిరేక పోరాటంలో భాగంగా మద్యం ధర తగ్గింపు పోరాటంగా ప్రారంభమై 1989 నాటికి మద్యనిషేధ పోరాటంగా మారింది. విప్లవ పార్టీల ఆధ్వర్యంలో ఈ పోరాటాలు పెద్ద ఎత్తున జరిగాయి. తెలంగాణ ప్రజానీకం అనన్యమైన అనేక త్యాగాలు చేసి మద్యం ధరను గణనీయంగా తగ్గించుకోగలిగారు. 1990 సం॥లో తెలంగాణ జిల్లాలోని వందలాది గ్రామాల్లోని లక్షలాది ప్రజానీకం మద్యాన్ని నిషేధించాలని డిమాండ్ చేస్తూ అనేక ప్రదర్శనలు – పోరాటాలను నిర్వహించారు. ప్రభుత్వ నిషేధం వచ్చే వరకు ఎదురుచూస్తూ కూర్చోకుండా తామే స్వచ్ఛందంగా నిషేధించారు. తమ గ్రామాల్లో మద్యం దుకాణాలను పెట్టనివ్వలేదు. త్రాగడం మానేస్తున్నాం అనీ, తమ గ్రామాలకు ప్రభుత్వ మద్యం రావాల్సిన అవసరం లేదనీ ప్రజలు ప్రకటించారు, పంచాయితీలలో తీర్మానాలు

చేసారు. ఇది సర్కారు వారి దృష్టిలో నేరం అయింది. సి.ఆర్.పి.యఫ్.ను తెలంగాణ గ్రామాల్లోకి ఉసిగొల్పారు. వేలాది మంది ప్రజల్ని అరెస్టులు చేశారు. చిత్రహింసలు పెట్టారు. స్త్రీలను అవమానపర్చారు. ఇండ్లు ధ్వంసం చేశారు. ఇవన్నీ చేయించింది ఎవరో కాదు. మద్యం నిషేధం పోరాటానికి తాను నాయకత్వం వహించాను అని చెప్పుకుంటూ మాట్లాడిన ఎన్.టి.ఆర్. తెలుగుదేశం ప్రభుత్వమే.

1991లో తెలంగాణలో వేలాది మంది ప్రజలు మండల కేంద్రాల్లో మద్యం వేలంపాటలు బంద్ చేయాలని వూరేగింపులు తీస్తే గ్రామాల్లో కాంగ్రెస్ ప్రభుత్వం 144 సెక్షన్ విధించింది. కర్ఫ్యూలు విధించారు. రోడ్లను బ్లాక్ చేశారు. వీటన్నింటినీ అధిగమించి వచ్చిన ప్రజలపై కాల్పులు కూడా జరిగిన సందర్భాలకు కొదవలేదు. మద్యం త్రాగం అన్న యువకుల్ని పోలీసులు మద్యం తాగకపోతే నక్సలైట్లని కేసు పెడ్తామని బెదిరించి వారిచేత త్రాగించిన సందర్భాలు ఉన్నాయి. ఎంత నిర్బంధం పెంచినా తెలంగాణా ప్రజానీకం స్వచ్ఛందంగా మద్య నిషేదాన్ని అమలు జరిపారు. పోలీస్ స్టేషన్లలో 1990 అక్టోబరు 2న గాంధీ జయంతి రోజున పోలీసులే స్వయంగా మద్యం అమ్మారంటే ఉద్యమ తీవ్రతను అర్థం చేసుకోవచ్చు.

తెలంగాణాలో జరిగిన మద్య నిషేధ పోరాట ప్రభావం నెల్లూరు జిల్లాలో సాక్షరతా కార్యక్రమం ద్వారా ప్రజలకు వచ్చిన జ్ఞానం, దూబగుంటలో మద్యం త్రాగి ఇద్దరు మరణించడంతో ఆ గ్రామ మహిళలు చలించి మద్యానికి వ్యతిరేకంగా కదిలి ముందుకు రావటం, కాంగ్రెస్‌లో ముఠాతగాదాలు. వీటన్నింటి మొత్తం ప్రభావం నేపథ్యంలో మద్యం నిషేధానికి మహిళలు కదిలారు అన్నది వాస్తవం. ఆ తర్వాత మద్య నిషేధాన్ని సమర్థిస్తూ మాట్లాడిన అన్ని రాజకీయ పార్టీలు వారి అవసరాల కోసం వచ్చి ఈ ఉద్యమంలో చేరారు అన్నది కూడా అంతే వాస్తవం. ప్రజలచే ముందుకు తీసుకువచ్చిన మద్యం పోరాటంగా, తరువాత నెల్లూరు జిల్లా మహిళల పోరాటంగా ముందుకు వచ్చిందనేది చారిత్రక సత్యం.

1993-94 మధ్య కాలంలో నెల్లూరు జిల్లాలో మద్య వ్యతిరేక ఉద్యమం ప్రభంజనంలా ముందుకు వచ్చింది. 40 వేల మందితో నెల్లూరులో ర్యాలీని నిర్వహించారు. 34 సార్లు వేలం పాటల్ని ఆపించిన ఘనచరిత్ర వీరిది.

ఈ నేపథ్యంలో 1993 అక్టోబర్ 2 గాంధీ జయంతి రోజున సంపూర్ణ మద్య నిషేధం హామీ ఇచ్చిన నేతలే గాంధీ విగ్రహాలకి దండలు వేయాలన్న పిలుపుతో పెద్ద ఎత్తున మహిళలు, ప్రజలు కదిలారు. అన్నిచోట్ల విగ్రహాలకు దండలు వేయకుండా అడ్డుకున్నారు. వారుణివాహిని తెచ్చి దారుణంగా మద్యాన్ని పారించిన మిమ్మల్ని ఎలా నమ్మాలి, ఎందుకు నమ్మాలి అని నిలదీయడం జరిగింది. సంపూర్ణ మద్య నిషేధాన్ని హామీ ఇస్తే తప్ప అనుమతించేది లేదని తేల్చి చెప్పడం జరిగింది. దానితో ప్రతిష్ఠ దెబ్బతిన్న ఎన్.టి.ఆర్. అక్కడికక్కడే కార్యకర్తల నుండి మైకు తీసుకుని తాము అధికారంలోకి వస్తే 2 నిమిషాల్లోనే నిషేధాన్ని అమలు చేస్తామని హామీ ఇస్తూ ప్రకటించారు. ఆ తర్వాత

దండవేసి వెళ్ళిపోయారు. ప్రతిపక్ష నేత దండ వేశారన్న సమాచారంతో ప్రభుత్వం ఉద్యమకారులపై విరుచుకుపడింది. లాఠీలు, భాష్పవాయు గోళాలతో రణరంగంగా మారిపోయింది ఆ ప్రాంతం. వేలాదిమంది అరెస్టులకు గురయ్యారు. ఈ ఘటన పెద్ద ఎత్తున మీడియాలో రిపోర్టు అయింది. దేశ వ్యాప్తంగా వ్యతిరేకత వచ్చింది. అనేక దేశాలలో ఈ వార్తలు వెలుగులోకి వచ్చారు. కర్నూలు, నెల్లూరు, ఇతర జిల్లాలలో స్త్రీ విముక్తి ఆధ్వర్యంలో జరిగిన మరికొన్ని పోరాటాలు చైతన్య మహిళా సమాఖ్య ఆధ్వర్యంలో జరిగిన మరికొన్నిపోరాటాలు తీవ్రమైన ప్రభావాన్ని చూపించాయి. ముఖ్యంగా ప్రధానమంత్రిగా పి.వి. నర్శింహారావు పోటీ చేసిన ఎన్నికలను, 2004 ఎన్నికలను సైతం మద్య వ్యతిరేక ఉద్యమం సవాల్ చేసింది. ఇవన్నీఎన్నికల ప్రచారంకోసం వాడుకుంటూ, ముఖ్యంగా నిషేధం అడిగితే నా అక్కా చెల్లెళ్ళను కొడతారా అని తనదైన శైలిలో ప్రసంగాలు చేస్తూ మహిళల ఓట్లతో గెలిచిన ఎన్.టి.ఆర్. సం|| కాలం మద్య నిషేధాన్ని అమలు చేశాడు. చాలామంది సంసారాలు బాగుపడ్డాయి. రాష్ట్రంలో శాంతి భద్రతలు మెరుగయ్యాయి. యాక్సిడెంట్‌లు, నేరాలు తగ్గాయని, ప్రజల కొనుగోలుశక్తి పెరిగిందని ప్రభుత్వమే ఓ నివేదికలో పేర్కొనడం విశేషం.

1995లో చంద్రబాబు వైస్రాయి హోటల్ సాక్షిగా మామ ఎన్.టి.ఆర్. ప్రభుత్వాన్ని కూల్చివేసి గద్దెనెక్కాడు. ప్రపంచ బ్యాంకు ఆదేశాల ప్రకారం శ్వేత పత్రాలను విడుదల చేశాడు. మద్య నిషేధం వల్ల రాష్ట్ర ఆదాయం కుంటు పడిందని సంక్షేమ పథకాలు అమలు చేయాలంటే మద్యం అమ్మకాలు తప్పనిసరి అని తమ మీడియా ద్వారా ప్రచారం చేసి మద్య నిషేధాన్ని తుంగలో తొక్కి దశలవారీగా ఎత్తేసాడు. మద్య నిషేధం కొనసాగిస్తున్నామని దానికి బదులు చీప్‌లిక్కరును ప్రవేశపెట్టాడు. వేల కోట్ల ఆదాయాల్ని ప్రభుత్వ ఖజానాకి పెంచాడు, లిక్కర్ సిండికేట్ల జేబులు నింపాడు. ఒకవైపు నిషేధాన్ని సక్రమంగా పటిష్టంగా అమలు చెయ్యకుండా మరోవైపు అక్రమ మద్యాన్ని విస్తృతంగా పారించాడు. మద్యనిషేధ కమిటీలు వేసి తమకు అనుకూలమైన వారితో నింపుకున్నారు. నిషేధం లేనప్పుడు కంటే ఉన్నపుడే మద్యం అన్ని గ్రామాల్లో బాగా లభ్యమయ్యేటట్లు చేసారు. నిషేధాన్ని విఫలం చేయించి అక్రమ మద్యం విస్తృతంగా పారుతుంది కాబట్టి నిషేధాన్ని ఎత్తివేశామని ప్రకటించారు. మహిళా సంఘాల ప్రతిఘటనల మధ్య, పోరాటాల మధ్య నిషేధానికి తూట్లు పొడిచారు.

ప్రతిపక్షనేత వై.యస్.ఆర్. 2004 ఎన్నికల్లో వై.ఎస్.ఆర్. రోశయ్య తదితరులు అంచెలంచెల మద్యం నిషేధాన్ని అమలు చేస్తానని హామీ ఇచ్చాడు. గద్దెనెక్కిన తర్వాత దీన్ని రివర్స్‌లో అమలు చేసాడు. దశల వారీగా పెంచుతూ 2009లో 32 డిస్టిలరీ కంపెనీలకు తోడుగా ఒక్కసారిగా మరో 40 డిస్టిలరీ కంపెనీలకు పర్మిషన్స్ ఇచ్చాడు. లాటరీ పద్ధతి నుండి వేలం పాటలకు మార్చి మద్యం మాఫియాకు తెరలేపాడు. టార్గెట్లు పెట్టి మరీ గత ప్రభుత్వం మద్యం అమ్మకాలు సాగించింది. మేము అధికారంలోకి వస్తే మద్యం అమ్మకాలు తగ్గిస్తాం, బెల్టుషాపులు ఎత్తివేస్తాం అని హామీ ఇచ్చిన వై.యస్.ఆర్. ప్రభుత్వం అన్ని వాగ్దానాలను మరచి గతం కన్నా మద్యాన్ని బలవంతంగా రుద్దింది. ఏ

పార్టీ ప్రతిపక్షంలో వున్నా ఓటు బ్యాంకుగా ఉపయోగించుకోవడానికి చూస్తుందే తప్ప నిజాయితీగా ఎవరూ వ్యవహరించరన్నది పదే పదే రుజువైన సత్యం. నిస్సిగ్గుగా రాజకీయ పార్టీలు మహిళల ఓటు బ్యాంకును కొల్లగొట్టడానికి మాత్రమే నిషేధాన్ని ఉపయోగించుకోవడం అత్యంత దుర్మార్గం.

ప్రభుత్వాలు ప్రతి ఊరిలో మంచి నీళ్ళు, బడి, ఆరోగ్య కేంద్రం లాంటివి లేకపోయినా మద్యాన్ని మాత్రం అందుబాటులో ఉంచుతూ భావితరాలని కూడా తాగుబోతులుగా తయారుచేస్తున్నారు. మద్య నిషేధం అమలు చేయాలని ఏదో ఒక మేరకు అన్ని పార్టీలు అంటాయి. కాని వారు అధికారంలో ఉన్నప్పుడు మాత్రం అమలు చెయ్యరు. నాటి వలసపాలకులైన బ్రిటిష్ వారి నుండి నేటి దళారి పాలకుల దాకా ఇదే తంతు కొనసాగింది. మద్యాన్ని ఆదాయ వనరుగా చూసినంత వరకు సంపూర్ణ మద్య నిషేధం అమలు కాదు. ఎక్కడైతే ప్రజా ఉద్యమాల్లో ప్రజలు, మహిళలు కూడా సంఘటితంగా చైతన్యవంతమై ఉద్యమాల్లో భాగం అవుతున్నారో అక్కడ మద్య నిషేధం అమలైంది. ఇది మనకు చరిత్ర చెప్పిన సత్యం.

గ్రామాలను అధ్యయనం చేసి రాష్ట్ర వ్యాప్తంగా సంక్షేమంలో అభివృద్ధిలో ప్రజలను భాగస్వామ్యం చేయవలసిన ప్రభుత్వాలు మద్యాన్ని పల్లె, పల్లెకూ రుద్దుతామనడం అన్యాయం. జనాభా ప్రాతిపదికన షాపులనడం అన్యాయం. అదే ప్రాతిపదికన పాఠశాలలు, ఆసుపత్రులు వున్నాయా? ప్రతి 30 మందికి తరగతి గది, 30 వేల మందికి ఆరోగ్య కేంద్రం, 500 మందికి ఒక డాక్టర్ ఉండాలి. వీటిని ఎప్పుడూ పట్టించుకోని సర్కారుకు జనాభా ప్రాతిపదికన కేవలం మద్యం గుర్తుకు రావడం శోచనీయం.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న ప్రపంచీకరణ విధానాలు, ఆర్థిక విధానాలు మహిళల జీవనాన్ని దెబ్బతీస్తున్నాయి. బిజెపి ప్రభుత్వ ఆర్థిక విధానాల కారణంగా సంఘటిత రంగం తగ్గి అసంఘటిత రంగం పెరుగుతోంది. కార్మిక వ్యతిరేక విధానాల ఫలితంగా మరింత అభద్రతను మహిళలు మోయవలసి వస్తున్నది. మున్సిపల్, అంగన్‌వాడి, మధ్యాహ్న భోజనం ఆశా వర్కర్లు, గృహ నిర్మాణ కార్మికులు, కాంట్రాక్టు, ఔట్‌సోర్సింగ్, ఇంటిపని కార్మికులు శ్రమ దోపిడీతో పాటు లైంగిక దోపిడీకి గురవుతున్నారు. దీనికితోడు కూరగాయలు, నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశాన్ని అంటుకున్నాయి.

ప్రజా సంక్షేమం మరిచి స్త్రీలపై హింసను పెంచే ప్రభుత్వ మద్యం విధానానికి వ్యతిరేకంగా మహిళలను కూడగట్టాలి. సంసారాలను నాశనం చేసే మాయదారి మద్యం వద్దు, మంచినీళ్ళు కావాలి. ఉచిత విద్య కావాలి. అందరికీ ఆరోగ్యం కావాలి. ఇండ్ల పట్టాలు – సాగుభూములు కావాలి. ఉపాధి, మహిళల భద్రత కావాలి అని నినదిద్దాం. హింసలేని కుటుంబాలు, సమాజం మహిళల హక్కు అని చాటుదాం. మహిళా సంఘాల నాయకత్వంలో, విశాల ప్రజానీకాన్ని ఐక్యంచేసిన క్రియాశీల పోరాటాలను మరోసారి నిర్మిద్దాం. మద్యం మహమ్మారిని తరిమేందుకు, కుటుంబాలను రక్షించుకునేందుకు కలిసి సంఘటితంగా ఉద్యమిద్దాం.

# 9. మద్యపానం వల్ల కష్టనష్టాలు

- ఉపాసక షర్మిల, ఆదరణ స్వచ్ఛంద సేవా సంస్థ,
తాడేపల్లి గూడెం, సెల్ : 9397872864

ఆల్కహాల్, మద్యపానం రెండూ ఒక్కటే. మద్యపానం సేవించడం వలన మనకి లభించేదేమిటో తెలియదు గాని అతని కుటుంబం మాత్రం అల్లరిపాలౌతుంది. ఇందులో మళ్ళీ ధనికవర్గం తాగేది ఒక రకం కాగా, పేదవర్గం తాగేది ఒక రకంగా వుందట. మద్యం సేవించిన మనిషి విచక్షణా జ్ఞానం కోల్పోతాడని ప్రభుత్వానికీ తెలుసు, తాగే వ్యక్తికి తెలుసు. మనిషి నిలకడగా, నిజాయితీగా వుంటే అవినీతి, అక్రమాలను ఎక్కడ ప్రశ్నిస్తాడోనని మద్యపానం వంకతో మనుష్యులను అజ్ఞానంలోకి నడిపిస్తున్నారు ప్రభుత్వంవారు.

గతంలో సారా వ్యతిరేక ఉద్యమం మహిళలు నడుపుచున్నపుడు పావలావడ్డీ పేరుతో మహిళల్ని ప్రశ్నించే తత్వం నుండి పక్కకు మళ్ళించారు. ఎన్ని ప్రభుత్వాలు మారినా పేదోళ్ళ దగ్గర దోచుకునే ప్రభుత్వాలే తప్ప సమాజంపై, భవిష్యత్ తరాలపై బాధ్యత కలిగిన ప్రభుత్వాన్ని చూడలేము. ప్రజల్లో నైతికపరమైన మార్పు వస్తే తప్ప, ఉద్యమాల వల్ల మార్పురాదు.

ఇటీవల విజయవాడలో మద్యం మత్తులో మాంసం కూర వండలేదని, విచక్షణ కోల్పోయి కొడుకు 60 సం॥ల కన్నతల్లిని చెరచగా తీవ్ర రక్తస్రావమైన ఆ ముసలితల్లి అపస్మారకస్థితిలోకి వెళ్ళి చనిపోయింది. ఒకవేళ ఆమె బ్రతికినా జరిగిన ఘోరానికి గుండె ఆగి చనిపోయుండేదే.

ఇటువంటి ఘోరాలు జరుగుతున్నా, వీధికోబారు పెట్టి, సందుకో మద్యం కొట్టుపెట్టి చోద్యం చూస్తుందీ ప్రభుత్వం.

మద్యపానం సేవించడం గుండెపోటు రావడానికి కూడా కారణం. మద్యం సేవించేటపుడు వ్యక్తులు తీసుకునే పదార్థాలలోని నూనె, క్రొవ్వులను ట్రైగ్లిసరైడ్స్ అంటారు. ఆల్కమాల్ నిర్మాణం, గిజరోల్ నిర్మాణాన్ని పోలి వుండడం వలన, ఆల్కహాల్ సేవనంతో రక్తంలో ట్రైగ్లిసరైడ్స్ పెరుగుతుంది. మద్యపానం వల్ల మానసిక వత్తిడి పెరిగి, కుటుంబ సభ్యుల మధ్య వ్యక్తిగత సంబంధాలు దెబ్బతింటాయి.

అంతేకాకుండా, కాలేయ వ్యాధులకు, గాస్ట్రైటిస్, నరాలు దెబ్బతినడానికి మద్యపానం సేవించడమే కారణం. మద్యం సేవించిన వ్యక్తి మృగమై ఇంట్లో వీరంగాన్ని సృష్టిస్తుంటాడు, ఇటువంటి సంఘటనలు పిల్లల మనసులపై అనేక విధాలుగా ప్రభావం చూపిస్తుంటాయి. మనది సమశీతోష్ణమైన భారతదేశం, ప్రలోభాలకు పోయి మద్యానికి బానిసై, సంసారాన్ని అప్పులపాలు చేసుకోవద్దు. మనది ఒకప్పుడు ప్రపంచ దేశాలన్నింటికీ ఉపధ్యాయ వంటి భారతదేశం. పాశ్చాత్య సంస్కృతిని అలవర్చుకుని, భారతదేశ సంస్కృతిని, కుటుంబాన్ని విచ్ఛిన్నం చేయవద్దు.

# 10. పేదల పాలిట శాపంగా మారిన మద్యపానం

– ఆత్రం సుగుణ, కన్వీనర్ : ఆదివాసీ మహిళా సంఘం,
ఉట్నూరు, ఆదిలాబాద్, సెల్ : 9490058905

పల్లె ప్రజలు కాయకష్టం చేసి తమ శ్రమను మరిచిపోవడానికి శ్రమించిన కూలి డబ్బుల నుండి సగం త్రాగడానికి ఖర్చుచేసి ఇంటివద్ద ఉన్న కుటుంబాన్ని చాలీ చాలని అర్ధాకలితో ఉంచి తనేమో మత్తులో మైమరచి మునిగి తన బాధ్యతను భారాన్ని మరిచిపోతున్నారు. కుటుంబం, పిల్లల బాగోగులు చూడలేని దుస్థితి. కుటుంబ పోషణ బాధ్యతలన్నీ భార్యలే భర్తలై పిల్లల బాధ్యత, ఇంటి భారం అంతా మోయవలసిన పరిస్థితి.

ఈ పేదవాడి బలహీనతను ఆధారంగా చేసి దోచుకునేవాడు, మద్యం లైసెన్సు ముఠాలు, అధికారికంగా, నాయకునిగా, దేవునిగా అవతారం ఎత్తి జెలగలాగ జీవితాలను పీడించుచున్నారు. దళిత బహుజన వర్గాలు మద్యం త్రాగుటకు బానిసై తన స్థితిగతులు, మోసాలు, ఆర్థిక, అనారోగ్య, మానవ విలువలు అర్థం చేయలేని పరిస్థితికినెట్టివేయ బడుతున్నారు. దోపిడిదారుడు అనేక రూపంతాలు ఎత్తుతూ నరరూన రాక్షసత్వాన్ని పేద, బీద బహుజనులపై ప్రయోగించిరాబోయే తరాలకు కూడా తన అగ్రవర్ణ అధిపత్య అహంకారాన్ని కాపాడడానికి ప్రయత్నిస్తున్నాడు. "పిల్లికి చెలగాటం – ఎలుకకు ప్రాణ సంకటం" లా శ్రమజీవుల పరిస్థితి.

కరుడుగట్టిన క్రూరత్వం కర్మ సిద్ధాంతం, కర్మ, దయ, దోపిడి, ఆధ్యాత్మిక మాటలతో మీకు మద్యం త్రాగడం దేవుడిచ్చిన వరం, మద్యం మీరు త్రాగకపోతే ఎవరు త్రాగాలి? అది మీ జన్మ ప్రాప్తం... ఇలా త్రాగినవాడే నిజమైన మనిషి. ఏమి త్రాగనివాడు ఎర్రి కొడుకులు... ఇది దేవుని సురాపానకం... అంటూ అమాయక పేద బహుజన ప్రజలను రెచ్చగొట్టుతారు. పేదవాడి దేవుళ్ళకు, పండుగలకు సారా – కల్లు నైవేద్యాలు అయితే! అగ్రవర్ణావారి దేవుళ్ళకు గంగాజలం, తులసీ జలం, పవిత్ర జలం... ఇలా విడగొట్టి నమ్మబలికి అమాయకులను తాగించడంలో కూడా వారికున్న మోసం, దోపిడి స్వభావాన్ని రుద్దడం స్పష్టంగా అగుపిస్తుంది. మానవత్వం మరచి అడవి మృగాల వలె గ్రామ ప్రజలపై విరుచుకుపడిన మద్యం కాంట్రాక్టర్లు, నాయకులు, మన పాలకులు మద్యపానంపై ఎన్నో రకాలుగా ప్రేరేపించి కుటుంబాలను చెల్లా చెదురుచేసి దోపిడిదారులు వాళ్ళ పొట్టలు నింపుకుంటారు. మద్యానికి అలవాటుపడే విధంగా మద్యం లేనిదే బ్రతకలేను అనే విధంగా తయారుచేసేవారికి (సారా కాంట్రాక్టర్లకు) రక్షణ కవచాలుగా వాడుతుంటారు.

"మూలిగే నక్కపై – తాటికాయ పడ్డట్టు" కాంట్రాక్టర్లు, ప్రభుత్వాలు, చెట్టాపట్టాల్ వేసుకొని ప్రజల పాలిట శాపంగా మారినారు. మద్యానికి బానిసై శరీర అవయవాలన్నీ

పనిచేయలేని స్థితికి వస్తున్నాయి. నరాల బలహీనులై ఎంతోమంది చనిపోయారు. భార్యా పిల్లలను చంపిన సంఘటనలు కూడా ఉన్నాయి. మానవ విలువలు మరచి మానవ మృగాలుగా ప్రవర్తించిన ఘటనలు మన ముందర చాలా ఉన్నాయి. జైలుపాలు అయ్యి తనకు తానే ఆత్మహత్యలు, హత్యలు చేసిన అగత్యాలు ఎన్నో ఉన్నాయి. ఇదంతా పేదవాడి గూడు చెదిరిన బ్రతుకులు. దీన్ని చూసి పేదవాడి దీనస్థితిని మద్యంతో మానవ ముసుగులో ఉన్న మానవ భక్షకులు, సంబరాలు చేసే వాళ్లు, భూస్వామ్య దళారి వ్యవస్థ, పేదవాడి బ్రతుకులను మరింత ఛిద్రం చేయడం, వారిని నిరంతరం దుఃఖ సాగరంలో ఉంచడం.. నేటి కుల, మత, ఛాందసవాదులు, ప్రజాస్వామ్య ముసుగులో ఉన్న నాయకులు, మష్టి ముఠా ప్రభువులకు ఎంతో గర్వంగా ఉంటుంది. ఎందుకంటే ఈ చీకటి భారతావని మత్తులో ఉండి దౌర్జన్యుడి చేతిలో బానిసగా ఉండాలనే దోపిడీ ఆలోచనలతో పేదవాడిని పేదవాడిగానే ఉంచాలని ధనవంతుడు ఇంకా ఉన్నతంగా ఎదిగి దగాకోరు, దుష్ట దురహంతకులుగా దురాగతాలు చేస్తూనే ఉన్నత శిఖరాలకు ఎదుగుతూ ఉండాలని ప్రజాస్వామ్య భారతావనిలో భాగంగా రెండు తెలుగు రాష్ట్రాలు నిత్యం మద్యం మత్తులో రగులుతూ ఉంటేనే, అవినీతి, నిరంకుశ పాలన కొనసాగే ఆస్కారం ఉంటుంది.

దళిత బహుజన కుటుంబాలు దీర్ఘకాలిక సమస్యలను మరచి తాత్కాలికమైన సమస్యలపై సతమతమవుతూ జీవనోపాధికి, రిజర్వేషన్స్, అంతర్గత వైరుధ్యాల ఘర్షణతో నిత్యం ఉండాలి. వారి దృష్టి దోపిడీ, మోసాలు, కౄరత్వాల వైపు మళ్ళకుండా జాగ్రత్తలు వహిస్తూ అగ్రవర్ణాలవారు ఉంటారు. గత పూర్వ దోపిడీ స్వభావమైనా భూస్వామ్య నిరంకుశ దౌర్జన్యాలు, దొరతనాలతో దొరలుగ.. దేవుని సంభూతుడైన బ్రాహ్మణుడు, బ్రాహ్మణునిగా ఉండాలన్న వీరి భావాలను రక్షించాలన్న కొంత మంది బహుజనులును, పేద ప్రజలను వీరికి అనుకూలంగా మార్చి వీరిచ్చే మద్యానికి ఆశపడి బలహీన మనస్తత్వంగా మార్చుతారు. ఎవరైన చైతన్యవంతుడై ప్రశ్నించినా వారిని నయాన భయానాలతో మద్యం మత్తులో దించే ప్రయత్నాలు చేసి, అంతకు హీనంగా భౌతికంగా దాడి చేసి తన మద్యం సామ్రాజ్యాన్ని రక్షించుకొంటారు. ఇలాంటి భయంకర విపత్తులో, స్వంత సైన్యాలు నిర్మించడం ఈ సమాజానికి ప్రజాస్వామ్య వ్యవస్థకి కొరకరాని కొయ్యగా, గొడ్డలి వేటుగా మారినది.

ఈ మద్యపానాన్ని, విషభూతాన్ని నిషేధించాలని ప్రజాస్వామ్య ముసుగుతో పాలిస్తున్న పాలకులను, ప్రభుత్వాన్ని మహిళా సంఘాలు, ప్రజా సంఘాలు కోరిన "చెవుటోని ముందర శంఖం ఊదినట్లు"గా పాలకులు వ్యవహరిస్తున్నారు. ఎందుకంటే వారి పాలన అంతా పేద ప్రజల రక్తం పిండి, నల్ల ధనంతో ప్రజల శవాల మీద ఏరిన డబ్బుతో గెలిచినారు కాబట్టే యధావిధిగానే సాగాలని చూస్తారు. వీరంతా మన పాలక శాసన

సభలో నల్లధనంతో కార్పోరేటర్స్, కాంట్రాక్టర్లు కాబట్టి వారి ఆస్తులను కాపాడడమే వారికి ముఖ్యం.

స్వేచ్ఛ కొరకు నాటి నుండి నేటి వరకు ప్రపంచంలో పేదవాడి రక్తం కారనిచోటు అంటూ లేదు. కల్తీ, సారా – కల్లు దొరకని గల్లి అంటూ లేదేమో! అనిపిస్తుంది. రెండు సంవత్సరాల క్రితం సీమాంధ్ర పెట్టుబడిదారులు, మద్యం కాంట్రాక్టులకు వ్యతిరేకంగా మద్యం నిషేధించాలని గొంతులు చించినారు. మరి సకల జనుల పోరాటంతో సాధించిన తెలంగాణ రాష్ట్రంలో కూడా మద్యం ఏరులై పారుతుంటే మద్యంతో పేదవాడు అస్థిపంజరంలా మత్తులో ఊగి కొరిజీవిని వదులుతుంటే! తొడలు, జబ్బలు చర్చే తెలంగాణ నాయకగణం, తెలంగాణ దగాబడ్డ ప్రజల విముక్తికే ఉన్నాం అన్నవాళ్ళు... నేడు సీమాంధ్ర కాంట్రాక్టర్లతో సమానంగానే వారికి తీసిపోమన్నట్టుగా వ్యవహరిస్తున్నారంటే ఆశ్చర్యం లేదు. తెలంగాణ పేద ప్రజలను మద్యం మత్తులో ఉంచి దొరతనాలు, నియంత పోకడలు, తెలంగాణ దొరల మద్యం గుత్తదారుల పోకడాలకు ఎలాంటి మార్పు లేదు. సీమాంధ్ర పెట్టుబడిదారులు, తెలంగాణ దోపిడి దొరలకు వారి పూర్వపు దొంగబుద్ధులే ఉన్నాయి. పరాయి దోపిడి స్థానిక బడాదొరల చేతులలోకి వచ్చింది. "పెనం నుండి పొయ్యిలోకి పడిన" చందంగా మారింది. ఇంటి దొంగను ఈశ్వరుడు కూడా ఎరుగడు అన్నట్లుగా తెలంగాణ దొరలకు చేతి నిండా దోచుకోవడానికి దారి దొరికినది. కాని పేదవాడి బ్రతుకుల గురించి జీవన పరిస్థితుల గురించి ఏమాత్రం ఆలోచించలేని దద్దమ్మలు, మూర్ఖులు తయారైనారు. తెలంగాణలో "గొర్రెను తినేవాడు పోయి – బర్రెను తినేవాడు వచ్చినట్లు"గా మన రెండు తెలుగు రాష్ట్ర పాలకుల విధానాలు అద్దం పడుతున్నాయి. కలుషితమైన మురికి నీటితో ప్రాణాలు తీసే విష రసాయనాలతో, క్రిమి సంహారక మందులు కలిపి నకిలీ కల్లు, తయారుచేసి పేదవాడి రక్తమాంసాన్ని, నిండు జీవితాన్ని సారా రూపంలో రాబందువులా జుర్రుతూ, గుట్కాలు మేస్తూ మింగుతున్నారు. దీని వలన దొంగల ముఠాలు ప్రభుత్వ ఖజానా పెరిగిందని చంకలు గుద్దుతున్నారు, మనిషికి మంచినీరు దొరకదు. ఇల్లు ఉండదు, కడుపునిండ తిండి దొరకదు, చేతినిండ పని ఉండదు, దొరికిన పనికి తగ్గ కూలీ ఇవ్వరు, ఇచ్చిన కూలి ఇంటికి పోదు. నెలకో వారానికో వచ్చిన డబ్బులు మద్యం ఖజానలోకే చేరుతుంది. ప్రతిరోజు దినదిన గండంగా జీవిస్తాడు.

మద్యం దళారి నిరంతరం పేదవాడి జీవితాలతో చెలగాటం ఆడుతూనే ఉంటాడు. రాష్ట్రాలు మారినా పాలకులు మారినా మద్యం మార్పులు ఉండవనేది నగ్నసత్యం. "కొత్త సీసాలో – పాత సారా" అన్న చందంగా ఏదైతేనేం ప్రజా హంతక విధానాలు, ప్రజా విధ్వంస చర్యలు వంటి వాటిని పాలకులు పెంచి పోషిస్తున్నారు. వారి పాలనా విధ్వంసక అభివృద్ధి ఆర్థికకోణంతో చూస్తారు.. పేదవాడు ఓటరుగానే ఉండాలని వాడి (పేద) రక్తం, చెమట కారుతూ ఉండాలని వారి కుటుంబాలు, భార్యా పిల్లలు (దుఖాలతో) బాధలతో

నెత్తిన చెదుర్తై, నిరంతరం దేహి-దొర-సార్-అయ్యా- నీ బాంచన్ దొర అంటూ బానిస బ్రతుకులతో... మద్యం మత్తును పెంచి పోషించాలనే దుర్మార్గమైన ఆలోచనలతో మన మద్యపాన పోషకులు నిరంతరం ప్రయత్నిస్తూనే ఉంటారు.

ఇలాంటి ఫాసిజానికి వ్యతిరేకంగా మహిళలు, బుద్ధిజీవులు ఉద్యమిస్తూనే ఉన్నారు. కాని అట్టి ఉద్యమాలను ధన, కండ, సైనిక బలంతో, తుపాకులతో, ఇనుప బూట్లతో అణచివేస్తున్నారు. మహిళాలోకం గొంతులు చించినా పిడికిలి బిగించినా వారి రోదన అరణ్య రోదనగానే మిగిలింది.

## ఆదివాసులపై మద్యం పెనుభూతం :

ఈ నరహంతక మద్యం ప్రభావం అటవీ ప్రాంతాలలో ఆదివాసుల పాలిటి పెనుభూతమై వారి గూడాల మీద పడి కుటుంబాలను ధ్వంసం చేస్తున్నది. ఎవరి జోలికి పోనటువంటివారు దోపిడి అంటే ఏమిటో తెలియని మానవ మూర్తులు, ఏ జీవికీ హాని చేయనివారు, వారి ప్రాంతంలోని అటవీ ప్రకృతి సహజ సంపద, వన జీవులతో గడుపుతూ అడవిలోని దొరికే వస్తువులను ఆహారంగా వాడుతూ వారి అవసర రీత్యా మిగిలిన వాటిని ఎలాంటి కల్తీ లేకుండా మైదాన ప్రజలకు ప్రకృతి సిద్ధమైన ఫలాలను అందిస్తారు. వారి ఆచార వ్యవహారాలు, సంస్కృతి సాంప్రద్యాయాలలో భాగంగా వాడే ఆహారాలతోపాటు పానీయాలు, చెలిమెలు, తేనె, ఇప్ప, మానే, ఇప్పసారా, ఇతర వృక్షాల కల్లు స్వయంగా తయారుచేసి, పండుగలకు, దేవుళ్ళకు, నైవేద్యానికి మరియుచిన్న పెద్ద అందరు కలిసి సమిష్టిగా ఆ రోజు సంతోషాలు, సంబరాలు చేసుకునేవారు. వీరు తీసిన కల్లు, ఇప్ప సారా అమ్మడమో, వ్యాపారమో చేసేవారు కాదు. వారి స్వంతాన వారే ఉపయోగించేవారు. ఇట్టి ఏ కల్మషం లేని ఆదివాసి గూడాల మీద, వారు తీసుకొచ్చే అటవీ ఉత్పత్తుల మీద, సంపద మీద, పచ్చని అడవి మీద, జీవితాల మీద, దుర్మార్గులైన మానవ నరరూప రాక్షసులు దోపిడీదారుల, మోసగాళ్ల, నరహంతకుల కన్ను పడ్డది. అప్పటి నుండి ఆదివాసి గూడాలపై, ఇప్పటి వస్తువులు వారికి (ఆదివాసులకు) ఎరజూపి మోసాలతో "నీటిలో చాపలా" దాడి మొదలైనది. ఆదివాసులు స్వయం సహజ ఉత్పత్తులను, సంపదను కార్పొరేట్ సంస్థలకు అప్పుజెప్పి ప్రపంచ బ్యాంకు షరతులకు తల ఒగ్గుతూ, బహుళజాతి కంపెనీలకు అప్పచెప్పుతూ, ఆదివాసులను మోసం చేస్తూ, వారి శరీరాలపై ప్రయోగాలు చేస్తూ దోపిడి నాగరికత "మేకవన్నె పులుల" వైపు మళ్ళించి వారి విషకోరల్లో చిక్కుకొని విలవిలలాడుచున్నారు.

వీరి (ఆదివాసుల) ప్రకృతి సిద్ధంగా, దొరికే ఆహార పానీయాలను దొరకకుండా, ఉత్పత్తులను చట్ట విరుద్ధం అని అభివృద్ధి పేరుతో యాంత్రిక యుగం అంటూ ధ్వంసం

దోపిడీ పాలకులు, పెట్టుబడులు పెట్టే ప్రపంచ బహుళ జాతి కంపెనీలు పరాయీకరణ చదరంగంలో భాగమైన మన ప్రభుత్వం మద్యం క్రిమి సంహారక మందులతో తయారుచేసి వారి ప్రాంతాలకు తెచ్చి అమ్మడం మొదలైనది. ఆనాటి నుండి స్వయం ఉత్పత్తులు, పానీయాలు కనుమరుగైనాయి. వారి చేతి నుండి సహజ సంపద జారిపోయింది. విషపూరితమైన మద్యం రావడంతో, గూడాలు కుటుంబాలు మనుషులు రోగాలతో పండుటాకువలె రాలుతూ జీవితమే దినదినగండంగా మారినది. ఈ ప్రభుత్వ మద్యం వద్దూ అంటే కాంట్రాక్టులు గుండాలు, ప్రభుత్వ పోలీసులు తుపాకీ గుళ్ళతో బూటకపు ఎన్‌కౌంటర్స్, మహిళలపై అత్యాచారాలు చేస్తూ భయభ్రాంతులకు గురిచేస్తున్నారు... బడా కాంట్రాక్టు పెట్టుబడిదారులు ప్రభుత్వం, మద్య నిషేధ ఉద్యమాలు చేస్తే ఈ రాబందు సర్కార్ పోలీసులు కూకటి వేళ్ళతో పీకి, తుపాకీతో అణచివేస్తున్నారు.

అభివృద్ధి కావాలంటే కృత్రిమ వస్తువులను వినియోగించి మద్యం తాగవలసిందే! మీ ప్రాంతాలలో అమ్మకాలు జరగవలసిందే! పర్యాటకులకు మీరు అందించాలి. స్థానికంగా ప్రభుత్వ మద్యం అమ్మాలి! త్రాగాలి... ఇతర ప్రాంత, దేశాల నుండి వచ్చే పర్యాటకులకు సకల మర్యాదలు, మద్యం ఎలా ఇవ్వాలి! ఇతర దేశాల నుండి వచ్చిన వారికి మద్యం ఎలా ఇవ్వాలి! వారి మధ్య మీరు ఎలా ఉండాలి. శిక్షణలు ఇచ్చి యువతీ యువకులకు తాత్కాలిక సుఖాలు ఇస్తూ ఇదే ప్రపంచంగా మలిచి వారిని "రెంటికి చెడ్డ రేవడిలా" తయారు చేయడం జరిగింది.

వారు ఇచ్చే మత్తు పానీయాలు, ఆహార ఫదార్థాలకు రోజంతా మత్తులో తుళ్ళుతూ ఉంటాడు. ప్రతి మానవుని ఆయుష్షు 80 నుండి 100 సం. ఉంటే ఆదివాసికి 25 నుండి 30 సంవత్సరాలకే ఆయుష్షు పడిపోయింది.

ఈ ఆధునిక ప్రపంచం మద్యం మహమ్మారి ఆర్థిక మోజులో పడి పోలీసు బలగాలను పెంచి పోలీసుల చేత కావలి ఉన్ని తాగించడం దుర్మార్గం. ఇట్టి పరిస్థితుల నుండి బయటపడడానికి అందరు కృషి చేయాలి. ప్రజాస్వామ్య వ్యవస్థ ఎటువైపు ప్రయాణమో వేచి చూద్దాం...

**ప్రభుత్వాలకు మద్యం మహమ్మారి ప్రధానమా!**
**ప్రజారోగ్యం ప్రధానమా! ఆలోచించండి!!**

❦ ❦ ❦

# 1. మద్యపానం (కథ)

– పద్మజ, జట్టు ఆశ్రమం, పార్వతీపురం, సెల్ : 9440899365

ఆనంద్ ఒకరోజు బడికి వస్తే నాలుగు రోజులు మానివేయడం ఆనవాయితీ. బడికి ఎందుకు రావట్లేదని పట్టించుకునే క్రొత్త సైన్సు మాష్టారు రాకతో బడి వాతావరణం మారిపోయింది. ఆనంద్ లాంటి పిల్లలు చాలామంది బడికి సక్రమంగా రాకపోవడం గమనించిన మాష్టారు పిల్లలపై శ్రద్ధతో, ప్రేమతో పాఠాలు చెపుతూ చదువుకోవడం ఎంత అవసరమో నిత్యం గుర్తుచేయడం వలన కొందరు చదువులపై ఆసక్తి చూపసాగారు. కానీ ఆనంద్ బడికి సక్రమంగా రాకపోవడం, చిన్న విషయాలకు పిల్లలతో గొడవలకు దిగడం చూసి ఆనంద్ ఎందుకు అలా ప్రవర్తిస్తున్నాడో, తన మనస్సులో ఏముందో తెలుసుకుందామన్న నిర్ణయానికి వచ్చి, పిల్లలందర్నీ దగ్గరకు రమ్మనమని పిలిచారు సైన్సు మాష్టారు.

ముందురోజు బోధించిన 'చర్య–ప్రతిచర్య' అనే న్యూటన్ సిద్ధాంతాల్లోని అంశాన్ని మరల ఒకసారి ఉదాహరణలతో మననం చేయించారు. నేర్చుకున్న విషయాన్ని పుస్తకంలో వ్రాయమని కొంత సమయం ఇచ్చి ప్రతి విద్యార్థినీ పరిశీలిస్తూ ఉండిపోయారు. ఆనంద్ ఏమీ రాయకుండా కునుకుపాట్లు పడుతుంటే లేపి "ఎందుకు, చదువంటే ఇష్టం లేదా?" అని ప్రశ్నించారు మాష్టారు. తననూ ఒక మనిషిగా గుర్తించిన తొలి వ్యక్తి ఈ మాష్టారు ఏమి చెప్పినా వినాలనే శ్రద్ధ ఉన్నప్పటికీ చదువుకోలేని ఆనంద్ గట్టిగా తిరిగి సమాధానం చెప్పాడు– "సర్, నా స్థానంలో మీరే ఉంటే ఏమి చేస్తారు?" చిన్నవాడి నోట అంత లోతైన ప్రశ్న వస్తుందని ఊహించని సైన్సు మాష్టారు ఆనంద్‌ను దగ్గరకు తీసుకున్నాడు.

అంతవరకూ మొండివాడిలా, బెట్టు సరిగా ఉన్న ఒక తుంటరి ఆనంద్ మౌనంగా ఏడవసాగాడు. సున్నితంగా కన్నీళ్ళు తుడిచి కొద్ది నీరు త్రాగించిన తరువాత చెప్పాడు ఆనంద్ – తాగుబోతు తండ్రి రోజూ తాగి ఇంట్లో చేసే ఆగడాలు, తిట్లు, కొట్లాటల గురించి. రోజంతా కష్టపడి తల్లి సంపాయించిన చిన్న డబ్బు కూడా తాగుడుకోసం ఇవ్వమని చితకబాదటం, తినడానికి 'ముక్కల' కూర లేదని, మైకంలో సట్టిలో కూర చల్లెయ్యడం – ఆనంద్ ఇంట్లో మామూలే. కానీ, ఆ ముందు రోజు మాత్రం తల్లి సివంగి లాగా ఎదురుతిరిగింది. ఇది సహించలేని తండ్రి కాళ్ళతో తల్లిని తన్నడం, చూస్తూ ఊరుకోలేని ఆనంద్ అక్కను సహితం దుడ్డుకర్రతో కొట్టిన తండ్రిని తలుచుకుంటూ ఆనంద్ కళ్ళు మరింత ఎర్రబడుతుంటే కన్నీరు ధారగా కారసాగాయి. "ఇలాంటి ఇంట్లో ఏ పిల్లలైనా చక్కగా తినగలమా, నిద్రపోగలమా, పెరగగలమా? చదువగలమా?" –

అన్నట్లు మౌనంగా చూస్తూండిపోయాడు ఆనంద్. ఇలాంటి త్రాగుడుకు బలైపోతున్న లక్షలమంది పిల్లలు, వాళ్ళ తల్లులు పడుతున్న బాధలు, చితికిపోతున్న కుటుంబాలు - ఇవన్నీ మనస్సుతో చూసిన మాష్టారు కళ్ళు చమర్చక మానలేదు. కళ్ళు తుడుచుకుంటున్న పిల్లల్ని చూస్తూ "ఈ సమస్యకు పరిష్కారం ఏమిటి? మనమేం చేద్దాం?" అని వాళ్ళనే ప్రశ్నించాడు మాష్టారు. "మద్యం తయారుచేసే కంపెనీలు (ఫ్యాక్టరీలు) మూసెయ్యాలి సార్" - కసిగా అరిచాడు ఆనంద్, 'అంత పెద్దపని మన మాష్టారు వల్ల కాదేమో' - అన్నట్లు చూశారు కొందరు పిల్లలు. తలచుకుంటే ఏమైనా చేయగలడు మా మాష్టారు అన్నట్లు ఆశగా చూస్తున్నారు ఇంకొంతమంది పిల్లలు.

పోనీ మన ఊర్లో బ్రాందీషాపులు, కొట్లు నడపకుండా చూద్దామా అన్నారు కొద్దిమంది ఆడపిల్లలు. చేద్దామని ముందుకు 'ఉరికారు' వెనుక వరుసలో రోజూ అచేతనంగా కూర్చొనే విద్యార్థులు. సామాన్యంగా చిన్న పిల్లలు మాత్రమే పోరాటం చేస్తే సరిపోదని. ఊర్లో పెద్దల్ని కూడా కలుపుకుందామా అన్నారు మాష్టారు. 'పెద్దోళ్ళే' కద సార్, మద్యం అమ్మిస్తున్నారు. ఓట్లు వెయ్యండని ఇంటికి తెచ్చి మరీ ఇస్తున్నారు. వాళ్ళెలా మనకు సాయం చేస్తారు? అని ఎదురు ప్రశ్నించాడు - పదమూడేళ్ళకే జీవితాన్ని కాచి వడపోసినట్లున్న ఆనంద్. 'పెద్దలు' అంటే డబ్బుకోసం సమాజాన్ని దోచుకునే వారు కాకుండా మనసున్న పెద్దలు కూడా ఉంటారని పిల్లలు మాట్లాడుకోసాగారు. పుస్తకంలోని పాఠాలకు, ప్రశ్నలకు సమాధానాలు తెలియని పిల్లలు సహితం 'జీవితాన్ని ఇంత చక్కగా చదువుతున్నారన్న సంతృప్తితో నిట్టూరుస్తూ లేచి నిలబడ్డారు మాష్టారు. ఎలాగైనా రచ్చబండ దగ్గర సాయంత్రం మాట్లాడదామా అని పిల్లల్ని అడిగితే "రచ్చబండ మీద అమ్మలు కూర్చోరు 'నాన్న'లు రచ్చచేసే బండ అది" అని ఆనంద్ వ్యంగ్యంగా అంటుంటే 'ఘొల్లున' నవ్వడంతో మాష్టారు సహితం కడుపుబ్బా నవ్వారు. చివరికి రామమందిరం ముందున్న వేదిక దగ్గర, తొలి 'మద్యపాన వ్యతిరేక' సమావేశము సాయంత్రం 6:40 గంటలకు ఏర్పాటు చేయడమైనదని బడిలో దండోరా వేస్తూ ఊరంతా దండోరా వేసినంత పని చేసారు వెనుక వరుస విద్యార్థులు.

సాయంత్రం ఆరు గంటలకంతా ఇంటి పనుల్లో వంట పనుల్లో తల్లులకు అడక్కుండానే సాయం చేసి తల్లులతో సహా పిల్లలంతా రామమందిరానికి చేరుకున్నారు. అక్కడ అంతమంది తల్లీ, పిల్లలు కొత్త మాష్టారు ఎందుకు కూర్చున్నారో తెలియక కొద్దిమంది తాగుబోతులు కూడా కుతూహలం కొద్దీ వచ్చి కూర్చున్నారు. అంతలో అనుకున్న సమయానికి అక్కడికి చేరుకున్న మాష్టారికి చర్చ ఎలా ప్రారంభించాలో తెలియక చిన్నగా గొంతు సవరించుకొని ఊరిలోని బడి, పిల్లలు, చదువులు వీటి గురించి పిల్లల అభిప్రాయం

తెలుపమని కోరగా – ఆనంద్‌తో సహా కొద్దిమంది పిల్లలు త్రాగుడు వలన వాళ్ళ ఇళ్ళల్లో పడుతున్న ఇబ్బందులు, ఆరోగ్య సమస్యలు కూడ ఒక్కొక్కరూ ఏకరువు పెట్టసాగారు. మహిళలు కూడా గృహహింస గురించి గొంతు కలిపారు.

పగలూ, రాత్రీ అని తేడా లేకుండా మద్యం తాగి "దేశసేవ ఈ విధంగా చేస్తున్నాను. ప్రభుత్వం తన వంటి వారి మద్యంతోనే డబ్బుతోనే నడుస్తోంది" అని గర్వంగా వణుకు చేత్తో మీసం తిప్పుతూ ఇంకా ఏదో చెప్పబోయాడు అంకయ్య. అంతవరకూ పిల్లలు మాటలు వింటూ మౌనంగా ఉన్న మహిళలు అంకయ్యను తిడుతూ, "ఊరుకోరా తాగుబోతు చచ్చినోడా?" అంటూ నోరు మూయించారు. అంకయ్యకు 23 ఏళ్ళకే వణుకుడు రోగం; తండ్రి తాగుడుకు బలైపోగా తల్లి కష్టపడి కుటుంబ భారం మోస్తోంది. ఎంతమంది ఊరుకోమన్నా అంకయ్య మాత్రం సవాళ్ళు విసరసాగాడు. "నువ్వు మందు త్రాగడం మానుకో, కన్న తల్లికి కొద్దిగా సాయపడు" – అంటూ మహిళలంతా అంకయ్యపై మాటల బాణాలు సంధించారు. మద్యం మత్తు ఇంకా తగ్గని అంకయ్య "ఊర్లోని బెల్టు షాపులన్నింటినీ ఊరికి దగ్గర్లో ఉన్న బ్రాందీషాపును మూసి వెయ్యించండి – నేను త్రాగడంమానకపోతే నాపేరు అంకయ్యే కాదు" అని పట్టుబట్టాడు. ఈ మందు వల్లే నా వళ్ళూ ఇల్లూ గుల్లైందని వణుకుడు రోగం కొని తెచ్చుకున్నానని, ఆరోగ్యం పోవడం వలన పనిచేయలేకపోతున్నానని అంకయ్య ధైర్యంగా మాట్లాడుతుంటే పిల్లలు అతన్ని ఒక హీరోని చూస్తున్నట్లు చూస్తుండిపోయారు. ఇంతలో ఎవరో వచ్చి అంకయ్యను వెంట పెట్టుకొని ఊరి దగ్గర్లోని బ్రాందీషాపుకు వెళ్ళసాగారు. "రెండు చుక్కలు గొంతులో పడితే వళ్ళు మరచిపోతాడు, ఎదవ!" అంటూ తిట్టుకోసాగారు కొందరు ఆడవాళ్ళు.

సంభాషణలు అటూ, ఇటూ మళ్ళిపోతుండగా కొందరు యువకులు కూడా అక్కడకు చేరుకున్నారు. 'మద్యపానం' వలన ఎంత నష్టపోతున్నదీ ఉమ్మడిగా చర్చించసాగారు. రోజుకు ఒక్కొక్క ఇంటి నుండి 50 రూపాయలు కనీసం ఖర్చు పెడుతున్నట్లుగా నిర్ధారించారు. సుమారు 550 గడపలున్న ఆ ఊర్లో దాదాపు 400 ఇళ్ళలో కనీసం ఒక్కరైనా తాగుతున్నట్లు, అలా లెక్కిస్తే నెలకు, సంవత్సరానికి ఊరంతా కలిపి మద్యపాన మహమ్మారికి ఎంత ధారపోస్తున్నారో, ఎవరిని పోషిస్తున్నారో చర్చించుకోసాగారు. ఇన్ని లక్షల డబ్బు వృధా అవుతుంది, దీనితోపాటు ఆరోగ్యం దెబ్బతింటుంది. ఇంత ఘోరం చూస్తూ ఎలా ఊరుకుంటున్నామంతా త్రాగుడుకు బానిసలుకాని యువకులు ఉద్రేకం చెందసాగారు. ఇంటి వాతావరణం ఆనందకరంగా లేక పిల్లల మనస్సులు, చదువులు, భవిత ఎంత పాడువుతున్నాయో చెపుతూ పిల్లలు ఒక్కొక్కరూ మాట్లాడిన మాటలు అందరినీ కంటతడి పెట్టించాయి. రాత్రి టీవీ సీరియళ్ళ సమయం దాటినా తమ మహిళలు అంత

పట్టుదలగా చర్చించుకోవడం చూసిన కొంతమంది మగాళ్ళకు భయం పుట్టుకొచ్చింది. – "కొంపదీసి ఈ మాష్టారు, వెనుక పిల్లలతో కలిసి ఈ ఆడోళ్ళు రేపటి నుండి మద్యం దొరక్కుండా చేస్తారేమోనని". అంతలోనే కొందరు "ఈ ఆడవాళ్ళేమి చేయగలర్లే, ఉత్త ఊసుబోని కబుర్లు తప్ప" అంటూ ఎదురుగ్గానే ఆడవాళ్ళను హేళన చేయసాగారు. ఇదంతా వింటున్న పిల్లలు ఆవేశంతో "మద్యం, 'అమ్మొద్దు-త్రాగొద్దు" అంటూ అరుస్తూ లేచారు. "ప్రొద్దు మీరుతోంది ఈరోజుకు మాటలు ఆపుదాం" – అన్న మాష్టారి హెచ్చరింపులో అందరూ లేస్తూ మరల మాట్లాడుకుందాము – 'ఒక గట్టి పట్టు పడదాం' అని ఏకగ్రీవంగా నిర్ణయించుకున్నారు.

ఇలా ఎంతోమంది.'ఆనంద్'లు ఎంతో బాధపడడం, వాళ్ళ తల్లులు రెక్కలు ముక్కలు చేసుకున్నా పూట గడవని ఇళ్ళు, మద్యపాన పెనుభూతంతో వళ్ళు గుల్ల చేసుకుంటున్న తండ్రులు, గ్రామగ్రామానా, వాడవాడలా నిత్యం చూస్తూనే ఉంటాము. మద్యం తయారీని ఆపలేకపోతున్నా అమ్మకం – త్రాగడం నిషేధించే ఉద్యమాలు ఇంకా ఊపందుకుంటాయని సంతోషించే సైన్సు మాష్టారిని అభినందించాలా? ప్రయత్నంలో నిస్పృహ చెందవద్దని ధైర్యం చెప్పాలా? ఆలోచించండి.

"డబ్బుకోసం ప్రమాదకరమైన మాదక ద్రవ్యాల్ని, మనుష్యుల్ని రహస్యంగా రవాణా చేసే అక్రమ వ్యాపారులతో పోల్చి చూస్తే, అదే డబ్బుకోసం వినాశకరమైన మద్యాన్ని ప్రజాసంక్షేమంతో సంబంధం లేకుండా విచ్చలవిడిగా బహిరంగంగా అమ్ముకుంటున్న పాలకులు, రాజకీయ నాయకులు ఎంత పెద్ద నేరస్తులు కావాలి?"

# మద్యపాన వ్యతిరేక ప్రచార సమితి ప్రతినిధులు

ఉభయ తెలుగు రాష్ట్రాల్లోనూ ఈ అంశంపై దృష్టిగల వ్యక్తుల వివరాల్ని ఇక్కడిస్తున్నాం. ఇంకా మద్యంపై వారి పరిమితుల్లో స్పందిస్తున్నవాళ్ళు అక్కడక్కడా కొంతమంది ఉన్నప్పటికీ, మొత్తంగా ఏదోక సామాజిక చైతన్యోద్యమంలో ఉంటూనే మద్యపాన సమస్య పట్ల సహానుభూతిపరులుగా ఉన్నవారే ఎక్కువని గమనించ మనవి.

**ఉత్తరాంధ్ర** : 1. డా॥ ఎం.వి.ఆర్. కృష్ణాజీగారు, సెల్ : 9440193517
2. యాళ్ళ సూర్యనారాయణగారు, సెల్ : 7382476332

**ఉభయ గోదావరి** : 1. డా॥ ఎన్. సూర్యనారాయణగారు, సెల్ : 7801020258
2. డి. గంగాధరరావుగారు, సెల్ : 9949137353

**కృష్ణా, గుంటూరు** : 1. డా॥ సి.హెచ్. రవికుమార్‌గారు, సెల్ : 9440507775
2. ఈదర గోపీచంద్‌గారు, సెల్ : 9440345494

**రాయలసీమ** : 1. బి.వి. రాధాకృష్ణమూర్తిగారు, సెల్ : 9440623353
2. జె. రఘుపతిరావుగారు, సెల్ : 9441634533

**నల్గొండ** : 1. ఎన్. అమర్‌గారు, సెల్ : 9440102360
**మహబూబ్‌నగర్**: 2. కె. అయ్యన్నగారు, సెల్ : 8008655191

**ఖమ్మం, వరంగల్** : 1. డా॥ భానుప్రసాద్‌గారు సెల్ : 851986706
2. రాజుగారు, సెల్ : 9490393038

**మెదక్, రంగారెడ్డి** : 1. జి. సత్యనారాయణగారు, సెల్ : 9000111972
**కరీంనగర్:** 2. శ్రవణ్‌కుమార్‌గారు, సెల్ : 9948609591

**నిజామాబాద్** : 1. ఎస్. బొర్రన్నగారు, సెల్ : 8106318135
**ఆదిలాబాద్** : 2. భుజంగరావు గారు, సెల్ : 9440585605

**హైదరాబాద్** : 1. టి. రమేష్‌గారు, సెల్ : 9490098911
2. ఎమ్. రామబ్రహ్మంగారు, సెల్ : 9440547614

వీరేకాక మద్యపాన సమస్యపై ప్రత్యేకంగా దృష్టిపెట్టిన మద్య వ్యతిరేక ఐక్యవేదిక (జస్టిస్ అంబటి లక్ష్మణరావుగారి ఆధ్వర్యంలో లక్ష్మారెడ్డి తదితరులు), సత్యాన్వేషణ మండలి (పుట్టా సురేంద్రబాబుగారి ఆధ్వర్యంలో కోటప్రసాదశివరావు తదితరులు) మైత్రేయి బుద్ధ విహార (యార్లగడ్డ జగదీశ్వరరావుగారి ఆధ్వర్యంలో యనమదుల వెంకటేశ్వరరావు తదితరులు) ప్రజా ఉద్యమాల జాతీయ వేదిక (రామకృష్ణంరాజుగారి ఆధ్వర్యంలో సరస్వతి కవుల తదితరులు) మొదలగు సంస్థలు కొన్నున్నాయి. అలాగే వారి వారి పరిమితుల్లో పనిచేస్తున్న కార్యకర్తలు కూడా చాలామంది ఉన్నారు. వివరాలు కావాల్సినవారు మమ్మల్ని సంప్రదించవచ్చు.

# మద్యం ఉత్పత్తి బంద్ కానిదే మద్యపాన నిషేధం కల్ల

మద్యం మత్తు పదార్థం. ప్రకృతిలో సహజంగా లభించదు. మానవులు తమ విజ్ఞానం, నైపుణ్యంతో తయారు చేస్తారు. మద్యం ఉత్పత్తి ఒక పరిశ్రమ. కల్లు చిన్నతరహా కుటీర పరిశ్రమ, సారాయి, విస్కీ బ్రాందీ, వైన్ వగైరాలు పెద్ద పరిశ్రమలు. బీరు భారీ పరిశ్రమ.

ఈ పరిశ్రమవేత్తలు, ప్రజలకు ఉద్యోగాలు కల్పించి ధర్మాత్ములుగా పరిగణింప బడుతున్నారు. ప్రజల ఇల్లు గుల్ల చేసే వారుగా గుర్తింపబడటం లేదు. యదార్థం ఏమిటి? ప్రజల శ్రేయస్సుకు పనిచేసే ప్రభుత్వం, స్వతంత్రం వచ్చిన నాటి నుండీ ఈనాటి వరకు అన్నీ తెలిసినవారు ధనికులకు అత్యంత లాభదాయకమైన మద్యం ఉత్పిత్తి చేయటానికి లైసెన్సులు ఇచ్చి, సర్వసౌకర్యాలు కల్పించి, ముడి పదార్థాల దిగుమతికి విదేశ ద్రవ్యం ఇచ్చి, బ్యాంకుల ద్వారా తదితర ఆర్థిక సంస్థల ద్వారా ఆర్థిక సహాయం చేసి ప్రోత్సహించారు. మూడు పువ్వులు ఆరుకాయలుగా అభివృద్ధి చెందింది మద్య పరిశ్రమ (లిక్కర్ ఇండస్ట్రీ).

ఈ పరిశ్రమలో పనిచేసే కార్మికులే కాక, హొటల్ వ్యాపారస్తులు, సీసాలు, వాని మూతలు, లేబుల్స్ తయారుచేసే పరిశ్రమలు, అట్టపెట్టెలు తయారుచేసేవారు, ప్రచార సాధనాలు తయారుచేసేవారు – ఎంతోమంది మద్యపానం మీదే ఆధారపడి ఉన్నారు. వేలకోట్లు రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాలకు ఆదాయం వస్తున్నది. దానితో ప్రభుత్వం అభివృద్ధి కార్యక్రమాలు, సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు అమలు జరుపుతోందట! అందువలన మద్యపాన సమస్యని నైతిక సమస్యగా మాత్రమేకాదు. సుసంఘటితమైన ప్రభుత్వ సంపూర్ణ సహకారం, ప్రోత్సాహం, ప్రోద్బలం, పరిణామంగా గుర్తించవలసిన అవసరం ఉంది.

పరిశ్రమలు జడపదార్థాలు కావు. పరిశ్రమలు తత్కాల సమాజ విలువల్ని, మార్చేస్తాయి. భూమి దున్ని, విత్తనాలు నాటి పంటలు పండించే పరిశ్రమ – వ్యవసాయం అనాదు దేశద్రిమ్మరిగా ఉండే ఆదిమజాతి జీవన విధానాన్ని పూర్తిగా మార్చేసింది. వ్యవసాయ ప్రధానం, యాంత్రిక పరిశ్రమలు ప్రధానం అయిన సమాజాల నైతిక విలువలలో ఎనలేని వ్యత్యాసం. ఉదాహరణకి – హొటల్, రైలు, బస్సులు అంటరానితనాన్ని ఎంత దూరం చేశాయి? ఎన్ని ఉపన్యాసాలైనా సృష్టించలేని విప్లవాన్ని స్కూటర్లు సృష్టించాయి. ఈనాడు ముసలివారైన పూర్వాచార పరాయణ స్త్రీలు కూడా నిస్సంకోచంగా, నిర్భయంగా స్కూటర్లమీద మనుషుల వెనక ప్రయాణం చేస్తున్నారు – ఇలాంటివి ఎన్నో పేర్కొనవచ్చు పరిశ్రమల చమత్కారాలు.

వ్యాపారంలో, వాణిజ్యంలో, రాజకీయాలలో, పరిశ్రమలలో నాయకులంతా మద్యం సేవిస్తారు.మధ్య తరగతి ఆఫీసర్లు, గుమస్తాలు, పత్రికా విలేకరులు, కళాకారులు రచయితలు, కవులు, సినీతారలు అంతా త్రాగుతారు. వీరంతా సామాన్య ప్రజానీకానికి ఆదర్శ పురుషులు. మద్యపానం అలవాటు చేసుకోకపోతే వ్యాపారంలో, వాణిజ్యంలో విదేశాలలో తదితర రంగాలలో ఉన్నతస్థాయి, స్థానం చేరుకోలేరు అనే భ్రమ ఈనాడు విద్యార్థులలో ప్రబలంగా ఉంది. విద్యావంతులైన ఆడవారు సైతం మద్యపానాన్నిపెద్ద అభ్యంతరకరమైన వ్యసనంగా భావించటం లేదు. ఈనాడు మద్యపానానికి ఒక విచిత్రమైన గౌరవం వస్తోంది. అది మామూలయిపోతోంది.

ఇట్టి పరిస్థితులలో మద్య నిషేధం అమలు జరగాలంటే మద్యం ఉత్పత్తిచేసే పరిశ్రమలు మూత పడాలి. తత్ఫలితంగా వచ్చే నిరుద్యోగ సమస్యని, ప్రభుత్వం ఆదాయంలోలోటుని తదితర పర్యవసానాలను ప్రభుత్వం చక్కదిద్దుకోవాలి. మరో మార్గం లేదు.

అంచలవారీగా మద్య నిషేధాన్ని అమలు పరచటం కల్ల. జరగని పని. సరకు ఉత్పత్తి అయితే, ఉత్పత్తిదారులు అమ్మి తీరుతారు. వాయిదావేసే కొలది వ్యాధి ముదురుతుంది. రోగి మరణించిన తరువాత చికిత్స ప్రయత్నం అయినట్లవుతుంది.

మద్య నిషేధం అమలు జరిపాక తక్షణం లేక కొంతకాలం తరువాత మద్యపానం నూటికి నూరుపాళ్లు అంతం అవుతుందనుకోవటం అమాయకత్వం. అలాగా దొంగతనంగా మద్యం తయారుచేసేవారు ఉంటారు. కొందరు త్రాగుతారు, చస్తారు. జైళ్లకు వెడతారు. వాపోవలసిన పనిలేదు. ఈనాడు మద్యం ఉత్పత్తి గౌరవనీయమైన భారీ పరిశ్రమ. ఈ స్థితి అంతం కావాలి. మద్యం ఉత్పత్తి నేరం కావాలి. మధ్యేమార్గం మిధ్య.